జ్యోతిష విద్యార్థులకు ప్రత్యేకం

# జ్యోతిష ప్రశ్నోత్తరమాల

## 999 జ్యోతిష ప్రశ్నలకు జవాబులు




- మోహన్ పబ్లికేషన్స్, రాజమండ్రి

జ్యోతిష విద్యావంతులకు, విద్యార్థులకు

# 999 జ్యోతిష ప్రశ్నలకు - జవాబులు

# జ్యోతిష ప్రశ్నోత్తరమాల

AN FIRST BOOK ON JYOTHISHA QUESTION'S PAPERS


గ్రంథకర్త :

దైవజ్ఞ సార్వభౌమ

కీ॥శే॥ శ్రీ వోలేటి రామనాథశాస్త్రి సిద్ధాంతి

పరిష్కర్తలు :

బ్రహ్మశ్రీ శ్రీ వంగిపురపు వీరబ్రహ్మాదైవజ్ఞ

ఆదిపూడి వేంకట శివసాయిరామ్


జ్యోతిషం, సాముద్రికం, వాస్తు, సంఖ్యాశాస్త్రాదులు మీరు నేర్చుకోవాలనే వారికి ప్రశ్నలు - జవాబుల రూపముతో వ్రాయబడిన దీనిని చదవండి.

ఇది రామనాథశాస్త్రిగారి కలంనుండి ఆణిముత్యం

"ప్రతీఇంటా, ప్రతి లైబ్రరీలో ఉంచుకోదగిన పుస్తకం"


ప్రకాశకులు : ☎ 246 2565

## మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదురుగా,

కోటగుమ్మం, రాజమండ్రి -1.





2016 వెల : 60-00



# శుభకామన

బ్రహ్మశ్రీ వోలేటి రామనాధశాస్త్రి గారిచే వ్రాయబడిన జ్యోతిష ప్రశ్నోత్తరమాల యనెడి సమగ్ర జ్యోతిషాధ్యన గ్రంధము నేర్చువారికి కరదీపిక వంటిది. గ్రంధకర్త బహు గ్రంధములను శోధించి వ్రాయబడినది. ఆమూలాగ్ర పరిశోధనతో వెలువడిన ఈ గ్రంథము శాస్త్రనియమములకు కట్టుబడితో విరాజిల్లు చున్నది. ఇందు పది అధ్యాయములున్నవి. ప్రతి అధ్యాయము కూడ కంఠస్థము చేయతగ్గ విషయము అని పాఠకులెన్నడునూ మరువరాదు. ఈ గ్రంథమునకు సర్వహక్కులను పొంది అనేక ముద్రణలు చేయుచూ జ్యోతిష తత్పరులకు హితము చేయు చున్న రాజమండ్రి మోహన్ పబ్లికేషన్స్ వారు ప్రశంసనీయులు. ఈ గ్రంథం శతవత్సర వృద్ధిని బడయు గాక.

ఇట్లు

**వంగిపురపు వీరబ్రహ్మాదైవజ్ఞ**

శ్రీసనాతన వైదిక బ్రాహ్మణ సంస్థానము

అంగలకుదురు

గుంటూరుజిల్లా.

అంగలకుదురు

1-2-2005







**అఖిల భారత జ్యోతిష తంత్రశాస్త్ర మహాసభ - 1985**
**(ఆంధ్రప్రదేశ్ జ్యోతిష శాస్త్రజ్ఞ సంఘము)**
**మరియు గ్రహవాణి జ్యోతిష విజ్ఞాన మాసపత్రిక**
**1-1-336/1, చిక్కడపల్లి, హైదాబాద్,**
**ఆంధ్రప్రదేశ్ వారి ఆధ్వర్యములో)**

# యోగ్యతాపత్రము

ఆంధ్రప్రదేశ్ జ్యోతిర్వేత్తల సంఘ పండిత పరిషత్ మరియు గ్రహవాణి జ్యోతిష విజ్ఞాన పత్రికలవారి సలహా సంఘము వారి సౌజన్యముతో జరిగిన అఖిల భారత జ్యోతిష తంత్ర శాస్త్ర సంయుక్త మహాసభ సందర్భమున ప్రామాణిక జ్యోతిష తంత్ర శాస్త్రము నందు నిష్ణాతులై, గణనీయమైన సేవచేసిన శ్రీయుత వోలేటి రామనాథ శాస్త్రిగారికి 'దైవజ్ఞరత్న' బిరుదు నొసంగి సత్కరించుట మాకు కడుంగడు ముదావహము.

ఏవంవిధ పురస్కారము వారికి ఆంధ్రప్రదేశ్ రాజధాని యగు హైదారాబాద్ నగరమున సం॥ 1985 జూన్ 19వ తేదీన ఆంధ్రప్రదేశ్ జ్యోతిష సంఘ అధ్యక్షులు గ్రహవాణి పత్రికా సంపాదకులు వారి సంతకములు ముద్రలు ప్రమాణములుగా జారీ చేయడమయినది.

**పి.బి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి**
**అధ్యక్షులు**
**ఆంధ్రప్రదేశ్ జ్యోతిష శాస్త్రసంఘం**

**వి.యస్. యస్. శర్మ**
**సంపాదకులు**
**గ్రహవాణి**



# విజ్ఞాపనము

ఈ పుస్తకములో జ్యోతిష - సాముద్రిక - ప్రశ్న - ముహూర్త వాస్తు, సంఖ్యా శాస్త్రాదులకు సంబంధించిన అనేక విషయాలను ప్రశ్నలు, జవాబుల పద్ధతిలో తెలియజేయడమైనది. గురు, శిష్య సంవాద రూపమున శిష్యులు అడిగిన ధర్మ సందేహాలను గురువు గారు తీర్చినట్లు రచన సాగించితిని. ముఖ్యంగా జ్యోతిషము నేర్చుకొను వారికోసం ఈ ప్రయత్నం చేయవలసి వచ్చినది. ఇట్టి పుస్తకం ఒకటి వెలువరించవలసినదిగా కోరినందువలననే దీనిని ఆవిర్భవించితిని.

జ్యోతిష విద్యను తపాలమూలమున నేర్పవలసినదిగా కొందరును, స్వయముగా జ్యోతిషాలయమునకు వచ్చి నేర్చుకొను తలంపు గలదని కొందరును, తరచుగా లేఖలు వ్రాయుచున్నారు. వారి ఊహకు అనుగుణముగా యీ రచనను మలచి అందించుచుండుటచేత దీని ప్రతిని ఒక్కటి సంపాదించుకొన్న అనేక శాస్త్రముల లోని మర్మములు మీ అంతట మీరే ఇంటివద్ద పొందగలరని హామీ యిచ్చుచున్నాను.

గ్రంథకర్త.

ఆంధ్రప్రభ పుస్తక సమీక్షలో

తే. 31-8-86 దీని జ్యోతిష ప్రశ్నోత్తరమాల గురించి ఇట్లు వ్రాసిరి.

సమీక్షకులు : శ్రీ అల్లంరాజు గోపాలకృష్ణమూర్తి గారు.

జ్యోతిష ప్రశ్నోత్తరమాల

గ్రంథకర్త : వోలేటి రామనాధశాస్త్రి సిద్ధాంతి.

సృష్టి, స్థితిలయములకు సంబంధించిన ఫలితములు భూగోళమందలి గ్రహ మండలముల ద్వారా తెలియబడుననేది శృతి స్మృతి పురాణ ప్రసిద్ధమైయున్నది. గ్రహ మండలములలోని, గ్రహాలకే ఎక్కువ ప్రాధాన్యం కనబడుచున్నది. ఇందు చేతనే లోకములలో వైదిక కర్మలయందుగాని, యజ్ఞయాగాది క్రతువులందుగాని, యజమాని పరంగా, "సూర్యాదీనం నవానం, గ్రహణామానుకూల్యతా, ఫలసిద్ధిరస్తు" అని విధిగా ప్రారంభమందే ఆశీర్వదించుతారు. ఇట్టి వేదక్రియలకు, జ్యోతిశ్శాస్త్రం శిరోభూషణమై వున్నది. పవిత్రమైన వేదమునందు కూడా 'అదాధిజ్యోతిషం' అని వున్నందున వేదమే జ్యోతిశ్శాస్త్రమును ఈవిధముగా ప్రస్తుతించినదని నిశ్చయార్థం.

ఇట్టి జ్యోతిషమునకు ఆదిత్యాది నవగ్రహములు, మేషాది మీన పర్యంతమైన ద్వాదశి రాసులు క్రమశః కాలపురుషుని శిరఃపాద పర్యంతం, సుప్రతిష్టములై యున్నవి. ఈ గ్రహములకే సకల జీవరాసుల సృష్టి, స్థితి లయములకు మూలములు ఈ నవగ్రహ సంచార క్రమవిధానమే కాలము అని పిలవబడుచున్నది. ఇట్టి కాలమును తెలిసికొనుటకే ప్రతివారు యే దైవజ్ఞుని వద్దకుపోయి వివాహాది మంగళకార్యములకుగాని, మరి ఇతరములైన తమ కార్యారంభ కాలాదులను తెలిసికొని, విధిగా ఆచరించుతారు. ఇటు కాలవిలువలను గుర్తించక దుష్కాలములయందు సుకార్యములను ఆచరించి నష్ట ఫలితములు పొందినవారు లోకమున ఎందరోగలరు. అట్టి శుభకార్యములను తెల్సుకొనుటకు శాస్త్ర పాండిత్యమే గాక సహృదయము సత్యదయా శౌచములు దేవతోపాసనాదికములచే దైవానుగ్రహం పొందినగాని అవగతముకాదు. విషయములను తెలిసికొనువారు కూడా దైవజ్ఞునియందు పూజ్య భావం శాస్త్రమందు విశ్వాసము కలవారై యుండవలెను. అట్టి దైవజ్ఞకోటికి చెందినవారు, ఈ గ్రంధకర్త, శ్రీ రామనాధశాస్త్రిగారు అనేక సంస్కృత గ్రంధాలను రచించినారు.

ఇందులో 16 అధ్యాయముల ద్వారా ఎన్నో రకాల జ్యోతిష సాముద్రిక, సంఖ్యా, వాస్తు, ముహూర్త, ధర్మసందేహాలు ప్రశ్నశాస్త్రం, జననకాలశుభాలు, రజస్వలా వేళావిశేషాలు, వివాహవిషయాలు, నవగ్రహ స్తోత్రములు, గోచార ఫలదర్శనము, ప్రయాణఫల సుజ్ఞానము పంచాంగ పరిశీలనము వ్యవసాయ ప్రకరణం జాతక పరిశోధనలు మొదలగునవి 999 విషయాలుగా చర్చింపబడి వ్రాయబడినవి.

పరిష్కర్త శ్రీ శాస్త్రిగారు శాస్త్రములకు సంబంధించిన విషయాలను మంచి కట్టుదిట్టంగా ప్రస్తార పద్ధతిలో వివరించారు. గ్రంథంలోని విషయాలను క్షుణ్ణంగా పరిశీలించి అందరకు తేలికగా అర్థమయ్యేటట్టు సులభశైలిలో వివరింపబడినవి.

జ్యోతిష, సాముద్రిక, వాస్తు శాస్త్రములు గురించి ప్రమాణభూతమైనది. ఇట్టి ఉద్గ్రంధాన్ని తగినట్లుగా పరిష్కరించినందులకు అభినందించు చున్నాను.

ఈ గ్రంథము జ్యోతిష , సాముద్రిక, వాస్తుశాస్త్ర పండితులకు విద్యార్థులకు కూడా నుపయుక్తం ప్రజాదరణ పాత్రమగువారి శ్రమకు తగిన ప్రోత్సా, సహకారమును ఆంధ్ర ప్రజానీకం వారికి చేకూరుస్తుందని ఆశిద్దాం.

ఇట్లు

**వంగిపురపుర వీరబ్రహ్మా దైవజ్ఞ**

అంగలకుదురు

తిరిగి యీ పుస్తకము ఐదవ ముద్రణగా ప్రశ్నోత్తర రూపమున పెంపు చేయబడి ముద్రింపబడినది.

ఆ ప్రతి ఇదే !

దీని వెల రూ. 36/-

# 999 జ్యోతిష్ ప్రశ్నలకు - జవాబులు

(జ్యోతిష ప్రశ్నోత్తరమాల)

## మొదటి అధ్యాయం-జ్యోతిషశాస్త్ర పరిచయము

## విషయసూచిక

క్రమసంఖ్య విషయము

26. కొన్ని ప్రత్యేక తారలేవి ?
27. యోగములెన్ని? అవియేవి ?
28. వర్జ్య మనగా నేమి ?
29. దుర్ముహూర్తమనగా నేమి ?
30. లగ్న ప్రమాణము లెంతెంత ?
31. తారాబల మెటుల తెలియును? దీనివలన లాభమేమి?
32. ఏఏ తారలెట్టి ఫలితాలిచ్చును ?
33. చంద్రబలమెట్లు తెలియును? దీనివలన లాభమేమి ?
34. పుష్కర కాలముల ఉపయోగమేమి ?
35. పంచకరహితము అనగా నేమి ?
36. కొన్ని నక్షత్రాలకు రెండేసి పేర్లుండును అవి ఏవి ?
37. నవకము అనగా ఏమి దీనినెట్లు తెలియగలము
38. శూన్యమాసము లేవి ?
39. మూఢము అనగా ఏమి ?
40. కర్తరియొక్క ప్రాముఖ్య మేమి?
41. పంచాంగము అనగాయేమి ?
42. గోచారమును గురించి చెప్పుము.
43. దీనిని తెలియుట వలన ప్రయోజనమేమి ?
44. గ్రహ గమన విధానం ఎటులుండవలెను
45. గ్రహ గుణములు వివరింపుము
46. గ్రహ కారకత్వ ఫలములేవి
47. సూర్యగ్రహణ మెట్లు ఏర్పడుచున్నది
48. కార్తె అనగా యేమి ?
49. అక్షాంశములనగా నేమి?
50. తారా భేదములు వివరింపుము.
51. ఆయన మనగా ఏమి ?
52. అనంత విశ్వమనగా నేమి?
53. అహోరాత్రములు అనగానేమి ?
54. అహస్సు అనగా ఏమి?
55. ఆయుర్దాయము నిర్ణాయములోని రకములను తెల్పుము.
56. ఉచ్ఛ అనగా ఏమి?
57. అంశ చక్రము అనగా యేమి?

58. ఉదయరాశి అనగా ఏమి ?
59. ఋక్షాద్యంతము అనగా ఏమి ?
60. ద్వాదశభావ స్థానములను తెల్పుము?
61. త్రిజ్యేష్ఠ విచారణ అనగా ఏమి?
62. అంగారక దోషము అనగా ఏమి?
63. కోణము లనగా ఏమి ?
64. గ్రహగతుల విధం తెల్పుము?
65. గ్రహ సమయములెన్ని అవి ఏవి ?
66. గ్రహముల దృష్టినిర్ణయ మెట్లుండును?
67. గ్రహజప సంఖ్య ఎట్లుండును?
68. గ్రహముల స్వభావము లెట్టివి?
69. గ్రహములకు గల షడ్బలము లేవి?
70. గ్రహజాతులు వివరింపుము?
71. గ్రహకళ లెటులుండును?
72. గ్రహస్పుటమనగా ఏమి ?
73. గ్రహావస్థలెన్ని అవి ఏవి?
74. గ్రహవర్ణము లెరిగింపుము?
75. గ్రహగుణములను తెల్పుము?
76. గ్రహ ధాతువులను వివరింపుము ?
77. గ్రహ దిక్కులను తెల్పుము.
78. గ్రహపాటు అనగా ఏమి?
79. గ్రహయుద్ధ మనగా ఏమి?
80. అయనాంశ అనగా నేమి?
81. గ్రహరుషుల నెఱిగింపుము?
82. గ్రహరత్నములేవి?
83. గ్రహములయొక్క కారకత్వములను తెలుపుము.
84. ఏ గ్రహ మెట్టిది?
85. జాతక కర్మ అనగా ఏమి?
86. రాశిచక్రము చేయు విధమెట్టిది?
87. దశాశేషము కనుగొనుటెట్లు?
88. అంతర్ధశను తెలిసికొనుటెట్లు?

89. విదశను కనుగొనుట ఎట్లు?
90. నక్షత్రముల కేర్పడు దశలేవి?
91. జన్మలగ్న నిర్ణయ మెటిగింపుము?
92. గ్రహమనగా ఏమి?
93. పంచాంగములో ఏముండును?
94. కొంతమంది జ్యోతిశ్శాస్త్రజ్ఞుల పేర్లను తెలుపుము?
95. కొన్ని జ్యోతిషగ్రంధములపేర్లు వ్రాయుము?
96. డిగ్రీ అనగా ఏమి?
97. "భ" చక్రము అనగా ఏమి?
98. భూవలయ మనగా ఏమి?
99. శింశుమార చక్రమనగా ఏమి?
100. జన్మకుండలి అనగా ఏమి?
101. లగ్న షడ్వర్గులేవి
102. ఆదివారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?
103. సోమవారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?
104. మంగళవారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?
105. బుధవారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?
106. గురువారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?
107. శుక్రవారము జన్మించినవారి లక్షణాలు ఏమిటి?
108. శనివారంము జన్మించినవారి లక్షణాలు ఏమిటి?
109. పగలు జన్మించినవారి లక్షణాలు ఏవి?
110. సంధ్యాకాలం జన్మించినవారి లక్షణాలు ఏవి?
111. రాత్రి జన్మించినవారి లక్షణాలు ఏవి?
112. పాడ్యమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
113. విదియ తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
114. తదియ తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
115. చవితి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
116. పంచమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
117. షష్టి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
118. సప్తమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
119. అష్టమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
120. నవమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?

121. దశమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
122. ఏకాదశి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
123. ద్వాదశి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
124. త్రయోదశి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
125. చతుర్దశి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
126. పూర్ణిమ తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
127. అమావాస్య తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?
128. శుక్లపక్షం జన్మించిన వారి లక్షణాలు ఏవి?
129. బహుళపక్షం జన్మించినవారి లక్షణాలు ఏవి?
130. వసంత ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?
131. గ్రీష్మ ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?
132. వర్ష ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?
133. శరదృతువులో జన్మించిన లక్షణాలు ఏవి?
134. హేమంత ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?
135. శిశిర ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?
136. ఉత్తరాయణంలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
137. దక్షిణాయనములో జన్మించిన లక్షణాలు ఏవి?
138. చైత్రమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
139. వైశాఖమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
140. జ్యేష్ఠ మాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
141. ఆషాఢమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
142. శ్రావణమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
143. భాద్రపదమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
144. ఆశ్వయుజమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
145. కార్తీకమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
146. మార్గశీర్షమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
147. పుష్యమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
148. మాఘ మాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
149. ఫాల్గుణమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
150. మేషరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
151. వృషభరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?

152. మిథునరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
153. కర్కాటక రాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
154. సింహరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
155. కన్యరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
156. తుల రాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
157. వృశ్చికరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
158. ధనుస్సురాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
159. మకరరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
160. కుంభరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
161. మీనరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?
162. విష్కంభయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
163. ప్రీతియోగ జన్మించిన లక్షణాలు ఏవి?
164. ఆయుష్మాన్ యోగ జన్మించిన లక్షణాలు ఏవి?
165. సౌభాగ్యయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
166. శోభనయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
167. అతిగండయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
168. సుకర్మయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
169. ధృతియోగ జన్మించిన లక్షణాలు ఏవి?
170. శూలయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
171. గండయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
172. వృద్ధియోగ జన్మించిన లక్షణాలు ఏవి?
173. ధ్రువయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
174. వ్యాఘాతయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
175. హర్షణయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
176. వజ్రయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
177. సిద్ధియోగ జన్మించిన లక్షణాలు ఏవి?
178. వ్యతీపాత్‌యోగ జన్మించిన లక్షణాలు ఏవి?
179. వరీయాన్‌యోగ జన్మించిన లక్షణాలు ఏవి?
180. పరిఘయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
181. శివయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
182. సిద్ధయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
183. సాధ్యయోగ జన్మించిన లక్షణాలు ఏవి?

184. శుభయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
185. సుభ్రయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
186. బ్రాహ్మయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
187. ఐంద్రయోగ జన్మించిన లక్షణాలు ఏవి?
188. వైధృతియోగ జన్మించిన లక్షణాలు ఏవి?
189. బవకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
190. బాలవకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
191. కౌలవకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
192. తైతులకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
193. గరజికరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
194. వణజికరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
195. విష్టికరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
196. శకునికరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
197. చతుష్పాత్‌కరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
198. నాగవకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
199. కింస్తుఘ్నకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?
200. అశ్వయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
201. గజయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
202. అశ్వయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
203. సర్పయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
204. శ్వాసయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
205. మార్జాలయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
206. మూషకయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
207. పశుయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
208. మహిషియోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
209. వ్యాఘ్రయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
210. మృగయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
211. కపియోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
212. నకుల యోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
213. సింహయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?
214. దేవగణ నక్షత్రాలలో జన్మించినవారి లక్షణాలు ఏవి?
215. మనుష్యగణ నక్షత్రాలలో జన్మించినవారి లక్షణాలు ఏవి?

216. రాక్షసగణ నక్షత్రాలలో జన్మించినవారి లక్షణాలు ఏవి?
217. మేషలగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
218. వృషభ లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
219. మిధున లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
220. కర్కాటక లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
221. సింహ లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
222. కన్య లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
223. తుల లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
224. ధనుస్సు లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
225. మకర లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
226. కుంభ లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
227. మీన లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
228. అశ్వని నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
229. భరణి నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
230. కృత్తిక నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
231. రోహిణి నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
232. మృగశిర నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
233. ఆర్ద్ర నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
234. పునర్వసు నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
235. పుష్యమి నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
236. ఆశ్లేష నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
237. మఖ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
238. పుబ్బ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
239. ఉత్తర నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
240. హస్త నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
241. చిత్త నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
242. స్వాతి నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
243. విశాఖ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
244. అనూరాధ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
245. జ్యేష్ఠ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
246. మూల నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?
247. పూర్వాషాఢ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?

## 2వ అధ్యాయము-సాముద్రిక సమాచారము

## మూడవ అధ్యాయము-సంఖ్యాశాస్త్ర మర్మములు

3. సంఖ్యాశాస్త్రమునకు ఏఏశాస్త్రములతో సంబంధముంది?
4. సంఖ్యా శాస్త్రరీత్యా రూఢిగా ఫలితాలు చెప్పగలవా?
5. దీని ప్రాముఖ్యమును వివరింపుము?
6. జాతకుల విభజన ఎటుల జరుగును?
7. నక్షత్రాలకు అదృష్టసంఖ్యలేవి?
8. సంఖ్యలు ఎన్నివిధములు?
9. విస్తారసంఖ్యను ఆధారసంఖ్యలుగా చేయుటెట్లె?
10. ఏఏ అంకెలు ఏఏ గ్రహాలకు సంబంధించినవి?
11. జాతక విభజనలోని రకములేవి?
12. ఏ అంకెవారు ఏ మణులు ధరింపవలెను?
13. ఒకటవ అంకె జాతకులెవరు ధరింపవలెను.
14. రెండవ అంకె జాతకులెవరు ధరింపవలెను.
15. మూడవ అంకె జాతకులెవరు ధరింపవలెను.
16. నాలుగవ అంకె జాతకులెవరు ధరింపవలెను.
17. అయిదవ అంకె జాతకులెవరు ధరింపవలెను.
18. ఆరవ అంకె జాతకులెవరు ధరింపవలెను.
19. ఏడవ అంకె జాతకులెవరు ధరింపవలెను.
20. ఎనిమిదవ అంకె జాతకులెవరు ధరింపవలెను.
21. తొమ్మిదవ అంకె జాతకులెవరు ధరింపవలెను.
22. ఏఏ సంఖ్యలవారికి యే సంఖ్యలు మేలుకల్గించును?
23. గ్రహప్రీతికై యే పూజలు జరిగించాలి?
24. సంఖ్యాశాస్త్ర జ్ఞానము వలన లాభమేమి?
25. 1వతేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
26. 2వ తేదీ జన్మించిన వారి లక్షణాలు ఏవి?
27. 3వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
28. 4వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
29. 5వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
30. 6వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
31. 7వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
32. 8వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
33. 9వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
34. 10వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?

35. 11వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
36. 12వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
37. 13వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
38. 14వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
39. 15వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
40. 16వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
41. 17వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
42. 18వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
43. 19వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
44. 20వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
45. 21వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
46. 22వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
47. 23వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
48. 24వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
49. 25వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
50. 26వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
51. 27వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
52. 28వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
53. 29వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
54. 30వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
55. 31వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?
56. జనవరి నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
57. ఫిబ్రవరి నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
58. మార్చి నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
59. ఏప్రియల్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
60. మే నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
61. జూన్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
62. జూలై నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
63. ఆగష్టు నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
64. సెప్టెంబర్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
65. అక్టోబర్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?
66. నవంబర్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?

## 4వ అధ్యాయము - గృహవాస్తు

29. సూర్యరశ్మి ఇంటిపై ఎట్లు పడవలెను?
30. ఇంటిపై ఏనీడ పడకూడదు.
31. సింహద్వార మెచ్చట ఉండవలయును
32. ఇంటికొరకు యేకలప ప్రశస్తము
33. యేవి పనికిరానివి
34. ఇటుకల కొలతలు ఎటులుండవలెను.
35. దూలముల కొలతలు ఎటులుండవలెను
36. గోడలు కట్టువిధము
37. గుజ్జులు గురించి నీకేమి తెలియును
38. వెన్ను నిర్మాణ మెట్లుండవలెను
39. ఉల్లోపు కొలతలు అనగా యేమి
40. ఇంటి గర్భము అనగా యేమి
41. ద్వారములు ఎట్లుంచవలెను.
42. స్తంభములను గూర్చి నీకేమి తెలియును
43. కిటికీలు ఎటుల నిర్మించవలెను
44. తలుపుల గురించి తెల్పుము
45. గృహారంభ మెటుల జరిగించవలెను
46. ఇంటిలో యేయే గదులు ఎచ్చట కట్టవలెను
47. గృహప్రవేశ విధానమును తెలుపుము
48. గృహప్రవేశ మెప్పుడు చేయవలెను
49. మత్స్య యంత్రస్థాపన దేనికి
50. గృహప్రాప్తికివలయు ప్రక్రియలేవి
51. గృహారంభము ఎప్పుడు చేయాలి?
52. గృహనిర్మాణము ఎప్పుడు చేయాలి ?
53. గదులు యేర్పాటు ఎలా చేయాలి?
54. వాస్తు పురుషస్థితి ఎలా వుంటుంది?
55. చెట్ల నీడలు ఎలా వుండాలి?
56. వాస్తు పూజా ప్రాముఖ్యము ఏమిటి?
57. వాస్తు పూజా మంత్రము ఏమిటి?
58. స్తంభ ప్రతిష్ఠకు ఎప్పుడు చేయాలి?
59. ఇటుకల ఆవము ఎప్పుడు చేయాలి?

## అయిదవ అధ్యాయము - ముహూర్త చంద్రిక

16. గృహప్రవేశమునకు
17. క్షౌరమునకు
18. దత్తతస్వీకారమునకు
19. కూపారంభమునకు
20. పొయ్యి వేసికొనుటకు
21. ఉపనయనము చేయుటకు మంచిముహూర్తమేది?
22. వివాహముచేయుటకు మంచిముహూర్తమేది?
23. దేవతాప్రతిష్ట చేయుటకు మంచిముహూర్తమేది?
24. గర్భాదానము చేయుటకు మంచిముహూర్తమేది?
25. యజ్ఞోపవీతధారణ చేయుటకు మంచిముహూర్తమేది?
26. ప్రయాణమునకు మంచిముహూర్తమేది?
27. క్రొత్తభూమిలో ప్రవేశించుటకు మంచిముహూర్తమేది?
28. హల కర్మకు మంచిముహూర్తమేది?
29. గృహము కొనుటకు మంచిముహూర్తమేది?
30. దూడలకు దుక్కి నేర్పుటకు మంచిముహూర్తమేది?
31. వరి ఉభాకు మంచిముహూర్తమేది?
32. చేనుకోతకు మంచిముహూర్తమేది?
33. తోటలు వేయుటకు మంచిముహూర్తమేది?
34. జననమునకు దోష నక్షత్రములేవి?
35. రజస్వలా శుభాశుభ కాలములేవి?
36. మృతి సంబంధించిన దోష తారలేవి?
37. పెండ్లికూతురును చేయుటకు తగిన ముహూర్తమేది?
38. ఆరోగ్య స్నానమునకు మంచిముహూర్తమేది?
39. చల్లకవ్వం నిల్పుటకు మంచిముహూర్తమేది?
40. క్రొత్తగా దుకాణం ప్రారంభించుట మంచిముహూర్తమేది?
41. ఔషధ సేవకు వలయు మంచిముహూర్తమేది?
42. నిశ్చయ తాంబూలమునకు మంచిముహూర్తమేది?
43. బాలింతరాలికి పథ్యం పెట్టుటకు మంచిముహూర్తమేది?
44. శిశువుకి మొలత్రాడు కట్టుటకు మంచిముహూర్తమేది?
45. శిశువును ఇల్లు బయలుదేరించుటకు మంచిముహూర్తమేది?
46. ఉద్యోగంలో చేరుటకు తగిన ముహూర్తమేది?

47. స్టీలు వస్తువులు బయటకు తీయుటకు మంచిముహూర్తమేది?
48. వాహనములు బయటకు తీయుటకు మంచిముహూర్తమేది?
49. అప్పు ఇచ్చుటకు మంచిముహూర్తమేది?
50. జోళ్ళు వాడుకొనుటకు మంచిముహూర్తమేది?
51. మేషలగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
52. వృషభలగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
53. మిధున లగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
54. కర్కాటక లగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
55. సింహలగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
56. కన్యాలగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
57. తులాలగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
58. ధనుస్సులగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
59. మకరలగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
60. కుంభలగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
61. మీనలగ్నమునందు చేయవలసిన శుభకార్యములు ఏవి ?
62. ఆదివారంనాడు చేయదగిన పనులు ఏవి?
63. ఆదివారంనాడు చేయకూడని పనులు ఏవి?
64. సోమవారం చేయదగిన పనులు ఏవి?
65. సోమవారం చేయకూడని పనులు ఏవి?
66. మంగళవారం చేయదగిన పనులు ఏవి ?
67. మంగళవారంనాడు చేయకూడని పనులు ఏవి?
68. బుధవారంనాడు చేయదగిన పనులు ఏవి?
69. బుధవారం చేయకూడని పనులు ఏవి?
70. గురువారం చేయదగిన పనులు ఏవి?
71. గురువారం చేయకూడని పనులు ఏవి?
72. శుక్రవారం చేయదగిన పనులు ఏవి?
73. శుక్రవారం చేయకూడని పనులు ఏవి?
74. శనివారమునాడు చేయదగిన పనులు ఏవి?
75. శనివారమునాడు చేయకూడని పనులు ఏవి?
76. పాడ్యమినందు చేయు కార్యములు ఏవి?
77. విదియ నందు చేయు కార్యములు ?

78. తదియ యందు చేయదగిన కార్యములు ఏవి?
79. చవితి యందు చేయదగిన కార్యములు ఏవి?
80. పంచమి యందు చేయదగిన కార్యములు ఏవి?
81. షష్ఠి యందు చేయదగిన కార్యములు ఏవి?
82. సప్తమి యందు చేయదగిన కార్యములు ఏవి?
83. అష్టమి యందు చేయదగిన కార్యములు ఏవి?
84. నవమి యందు చేయదగిన కార్యములు ఏవి?
85. దశమి యందు చేయదగిన కార్యములు ఏవి?
86. ఏకాదశి యందు చేయదగిన కార్యములు ఏవి?
87. త్రయోదశి యందు చేయదగిన కార్యములు ఏవి?
88. చతుర్ధశి యందు చేయదగిన కార్యములు ఏవి?
89. పూర్ణిమ యందు చేయదగిన కార్యములు ఏవి?
90. అమావాస్య యందు చేయదగిన కార్యములు ఏవి?
91. చైత్రమాసమున చేయదగు కార్యములు ఏవి?
92. వైశాఖమాస నెలలో చేయదగు కార్యములు ఏవి?
93. జ్యేష్టమాసములో చేయదగు కార్యములు ఏవి?
94. ఆషాఢమునందు చేయదగు శుభకార్యములు ఏవి?
95. శ్రావణమునందు చేయదగు కార్యములు ఏవి?
96. భాద్రపదమునందు చేయదగు శుభకార్యములు ఏవి?
97. ఆశ్వీజమాసమునందు చేయదగు శుభకార్యములు ఏవి?
98. కార్తీకము నందు చేయదగు కార్యాములు ఏవి?
99. మార్గశీర్షము నందు చేయదగు కార్యములు ఏవి?
100. పుష్యమాసమునందు చేయదగు కార్యములు ఏవి?
101. మాఘమాసమునందు ఆచరించదగు పనులు ఏవి?
102. ఫాల్గుణమాసములో చేయదగు కార్యములు ఏవి?
103. అశ్వని నక్షత్రములో చేయదగు కార్యములు ఏవి?
104. భరణి నక్షత్రములో చేయదగు కార్యములు ఏవి?
105. కృత్తిక నక్షత్రములో చేయదగు కార్యములు ఏవి?
106. రోహిణి నక్షత్రములో చేయదగు కార్యములు ఏవి?
107. మృగశిర నక్షత్రములో చేయదగు కార్యములు ఏవి?
108. ఆరుద్ర నక్షత్రములో చేయదగు కార్యములు ఏవి?

109. పునర్వసు నక్షత్రమున చేయదగు పనులు ఏవి?
110. పుష్యమి నక్షత్రమున ఆచరింపదగు శుభకార్యములు ఏవి?
111. ఆశ్లేష నక్షత్రములో ఆచరింపదగు కార్యములు ఏవి?
112. మఖ నక్షత్రములో చేయదగిన కార్యములు ఏవి?
113. పుబ్బ నక్షత్రములో చేయదగిన పనులు ఏవి?
114. ఉత్తరానక్షత్రమునందు చేయదగిన పనులు ఏవి?
115. హస్తానక్షత్రమునందు చేయదగిన పనులు ఏవి?
116. చిత్త నక్షత్రమునందు చేయదగిన పనులు ఏమి?
117. స్వాతి నక్షత్రమున చేయదగిన పనులు ఏమి?
118. విశాఖ నక్షత్రములో చేయదగిన కార్యములు ఏమి?
119. అనూరాధ నక్షత్రములో చేయదగిన కార్యములు ఏమి?
120. జ్యేష్ఠ నక్షత్రమున అందరూ ఆచరింపదగు కార్యములు ఏవి?
121. మూల నక్షత్రమున అందరూ ఆచరింపదగు శుభకార్యములు ఏవి?
122. పూర్వాషాఢ నక్షత్రమున చేయదగు కార్యములు ఏవి?
123. ఉత్తరాషాఢ నక్షత్రమున అందరూ ఆచరింపదగు కార్యములు ఏవి?
124. శ్రవణానక్షత్రమున చేయదగు శుభకార్యములు ఏవి?
125. ధనిష్ఠా నక్షత్రమున చేయదగు శుభకార్యములు ఏవి?
126. శతభిషం నక్షత్రమున ఆచరింపదగు కార్యములు ఏవి?
127. పూర్వాభాద్ర నక్షత్రమున ఆచరింపదగు కార్యములు ఏవి?
128. ఉత్తరాభాద్ర నక్షత్రమున ఆచరింపదగు కార్యములు ఏవి?
129. రేవతి నక్షత్రమున ఆచరింపదగు కార్యములు ఏవి?

## ఆరవ అధ్యాయము - ప్రశ్న పారిజాతము

1. ప్రశ్నఫల మెటుల చూడవలెను? 133
2. సీతాచక్రముద్వారా నీకేమి తెలియును?
3. కార్యసిద్ధి ప్రశ్నవలన లాభమేమి?
4. లగ్న ప్రశ్నఫల మెట్లు తెలియును?
5. పూజారుల ప్రాప్తి ప్రశ్నవలన లాభమేమి ?
6. పోయిన వస్తువు ఏ దిక్కున గలదు?
7. వ్యాధికారణ మెటుల తెలియును?
8. పంచపక్షి ప్రశ్నవలన ఏమి తెలియును?
9. జన్మించేది మగబిడ్డా! ఆడబిడ్డా !

## ఏడవ అధ్యాయము-గోచారఫల దర్శనము

## 8వ అధ్యాయము-నవగ్రహ పూజావిధానం



## 9వ అధ్యాయము-జాతక పరిశోధనము

## 10వ అధ్యాయము-వివిధ విషయాలు

10. అరటిగెల వేసిన దిక్కు ప్రభావమేమి?
11. రజస్వలాశుద్ధి యెటుల జరుగును?
12. చేతి గోళ్ళను తీసికొనుటకు ఎప్పుడు మంచిది?
13. గో ప్రసవం గూర్చి నీకేమి తెలియును?
14. బల్లి పలుకులు కలిగించు ఫలితమేమి?
15. పరామర్శకి వెళ్ళుటకు మంచిచెడ్డలేవి?
16. అవయవము లదురుట వలన ఫలమేమి?
17. తుమ్ము ఫలితములను తెల్పుము?
18. అశౌచ నిర్ణయ మెటుల చేయవలెను?
19. పక్షిణి పట్టదగ్గ వారెవరు?
20. ఆషాఢమాస విశేషమేమి?
21. గ్రామము మారుటకు మంచిచెడ్డలేమి?
22. ప్రయాణ విషయమై వారశూలలేవి?
23. ప్రయాణ దినమున వేయకూడని పనులేవి?
24. నిర్గమ మనగా నేమి?
25. కొన్ని శుభశకునములను గూర్చి తెలుపుము?
26. కొన్ని శుభశకునములను గూర్చి తెలుపుము?
27. శున్యుషః కాలమనగా ఏమి?
28. పంచాంగ పరిశీలనా జ్ఞానమెందు కవసరం
29. శుభముహూర్త మెటుల నిర్ణయించుకోవలెను?
30. జననకాలాదులకు నక్షత్రప్రశస్తిని తెలుపుము?
31. యోనికూటం అనగా ఏమి?
32. నక్షత్ర గణ విభజన తెల్పుము?
33. వివాహమునకాటంకములు తెల్పుము?
34. వివాహాకార్యానంతరం చేయకూడని పనులేవి?
35. పెండ్లిపీట యెటులుండవలెను?
36. ఏకోదర వివాహమును గూర్చి తెలుపుము?
37. వివాహ కన్యకు బదులు పేరేల పెట్టెదరు?
38. పెండ్లి అరుగు ఎటులుండవలెను?
39. నిష్క్రమణమునకు ఎప్పుడు చేయాలి?
40. సూర్యచంద్రుల దర్శనము ఎప్పుడు చేయాలి?

41. భూమ్యాప్రవేశము ఎప్పుడు చేయాలి?
42. బాలింతరాలికి పథ్యము ఎప్పుడు పెట్టవలెను?
43. బాలింతరాలికి స్నానం ఎప్పుడు చేయించాలి?
44. బాలెంత నీళ్ళుతోడుటకు ఎప్పుడు చేయించాలి?
45. ఆడపిల్లలను అత్తవారింటికి పంపుటకు ఎప్పుడు చేయాలి?
46. బిడ్డకు పండ్లు మొలచుట వలన దోషములులేవి?
47. శిశువులకు ఉపచారములు ఎలా చేయవలెను?
48. శిశువుకి మొలత్రాడు కట్టుటకు ఎప్పుడు చేయాలి?
49. క్రొత్తగిన్నెలు వాడుకొనుట ఎప్పుడు చేయాలి?
50. కేశఖండనమున ఎప్పుడు చేయాలి?
51. క్రొత్తవస్తువులు ఉపయోగించుట ఎప్పుడు చేయాలి?
52. అన్నప్రాశనమున ఎప్పుడు చేయాలి?
53. అన్నప్రాశనమునకు వారములు ఏమిటి?
54. అన్నప్రాశనమునకు నక్షత్రములు ఏవి?
55. చెవులు కుట్టుట ఎప్పుడు చేయాలి?
56. చల్లకవ్వము నిల్పుట ఎప్పుడు చేయాలి?
57. అక్షరాభ్యాసము ఎప్పుడు చేయాలి?
58. విద్యారంభము ఎప్పుడు చేయాలి?
59. సర్వశుభములకు మంచిది ఎప్పుడు?
60. దేవతా ప్రతిష్ట ఎప్పుడు చేయాలి?
61. ఔషధ సేవ ఎప్పుడు చేయాలి?
62. దుకాణం పెట్టుట ఎప్పుడు చేయాలి?
63. గ్రామము మారుట ఎప్పుడు చేయాలి?
64. నూతన వస్త్రధారణము ఎప్పుడు చేయాలి?
65. ఆరోగ్య స్నానము ఎప్పుడు చేయాలి?
66. ఉపనయనము ఎప్పుడు చేయాలి?
67. యజ్ఞోపవీతధారణ ఎప్పుడు చేయాలి?
68. నిశ్చయ తాంబూలములు ఎప్పుడు చేయాలి?
69. అలంకారములు ధరించుట ఎప్పుడు చేయాలి?
70. అభ్యంగము ఎప్పుడు చేయాలి?
71. పడవ నీటిలో దింపుట ఎప్పుడు చేయాలి?
72. గాలము ముహూర్తము ఎప్పుడు చేయాలి?

73. వివాహ శుభకార్యములు ఎప్పుడు చేయాలి?
74. ఏకోదర వివాహము ఎప్పుడు చేయాలి?
75. కుజదోషము అనగా నేమి?
76. పెండ్లికూతురును ఎప్పుడు చేయాలి?
77. వివాహ కన్యకు బదులు పేరు ఎప్పుడు పెట్టాలి?
78. పెండ్లిపీట ఎలా వుండాలి?
79. పెండ్లి అరుగు ఎలా వుండాలి?
80. అంకురార్పణము ఎప్పుడు చేయాలి?
81. యేక నక్షత్రజాతకులు ఎలా వుంటారు?
82. సింహస్థ గురుదోషము అంటే ఏమిటి?
83. త్రిజేష్ట విచారణ అంటే ఏమిటి?
84. వివాహోటంకములు ఎలా వుంటాయి?
85. క్షౌరము ఎప్పుడు చేయాలి?
86. ఆషాఢమాసం ఏమిచేయాలి?
87. అప్పుయిచ్చుట ఎప్పుడు చేయాలి?
88. నవవధూ ప్రవేశము ఎప్పుడు చేయాలి?
89. నిషేకము ఎప్పుడు చేయాలి?
90. గర్భాదానము ఎప్పుడు చేయాలి?
91. పుంసవనము ఎప్పుడు చేయాలి?
92. సీమంతము (గాజులుపెట్టించుటకు) ఎప్పుడు చేయాలి?
93. త్రివిధ నవములు ఏమి?
94. ప్రయాణమున చేయకూడని పనులు ఏమిటి?
95. కొన్ని ప్రయాణ గమనికలు ఏవి?
96. శుభశకునములు ఏమి?
97. అశుభ శకునములు ఏమి?
98. హలకర్మకు (యేరువాకకు) ఎప్పుడు చేయాలి?
99. వరిఉభాకు వరిచేను ఊడ్చుట ఎప్పుడు చేయాలి?
100. వ్యవసాయ కార్యములు ఎప్పుడు చేయాలి?
101. చేనుకోతకు (పిడి అంటుటకు) ఎప్పుడు చేయాలి?
102. గోశాల వేయుటకు ఎప్పుడు చేయాలి?
103. వృషభ కర్మ ఎప్పుడు చేయాలి?
104. నూతన భూప్రవేశము ఎప్పుడు చేయాలి?

శ్రీరస్తు

# జ్యోతిష ప్రశ్నోత్తరమాల

## మొదటి అధ్యాయం-జ్యోతిషశాస్త్రము

లఘువిజ్ఞప్తి - జ్యోతిషం నేర్చుకొనువారికోసం ప్రత్యేక శ్రద్ధతో ప్రశ్నలు-జవాబుల రూపములో సులభశైలిలో వ్రాయబడిన యీ పుస్తకం ప్రతిసామాన్య గృహస్థునకు, ప్రతిపౌరోహిత్యం నెరపేవారికి మరియు జ్యోతిష శాస్త్రముమీద అభిలాష గలవారికి ఎంతగానో ఉపకరిస్తుంది, శాస్త్ర విజ్ఞాన సముపార్జనకు పనికివచ్చు అనేక నూతన విషయములు క్రొత్తగా యిందు చేర్చితిమి.

జ్యోతిషశాస్త్ర ప్రచారమే నా ధ్యేయము - రచయిత-

**1. జ్యోతిషమనగా ఏమి?**

ఇది ఒక శాస్త్రము వేదములలో ఒకటి. జోతిష్యమని దీనికి మరొక పేరుగలదు. సూరచంద్రాది గ్రహ మండలము నక్షత్ర మండలము వీనికి సంబంధించిన అనేక విషయములను ఇది తెల్పును. జ్యోతిష్ అనగా వెలుగు లేక పరమాత్మ. అట్టి దానిని గ్రహించి చెప్పుటకు నేత్రములకేగాని మిగతా అవయవములకు శక్యముకాదు. ఇది వేదములకు సంబంధించిన షడంగములలో ఒకటి, షడంగములు 1. శిక్ష 2. వ్యాకరణము 3. ఛందస్సు 4. నిరుక్తము 5. జ్యోతిషము 6. కల్పము.

ఈ శాస్త్రమునకు సూర్యచంద్రులు ప్రత్యక్ష సాక్షులు ఇది వేద పురుషునకు నేత్రమువంటిది. ఈ శాస్త్రము శ్రీమన్నారాయణమూర్తి వల్ల మొదట సనకసానాదులకు బ్రహ్మప్రార్థనపై తెలుపబడినది. ఆపై నారద ప్రహ్లాద, గర్గ, అత్రి భృగు మొదలగు ఋషులవల్ల లోకంలో ప్రచారమైనది.

**2. జ్యోతిషములో ఏఏ భాగములుండును ?**

ముఖ్యముగా 3 భాగములుగా విభజింపవచ్చును.

1. ముహూర్తము 2. సిద్ధాంతము 3. జాతకము వీనికి ఉపభాగములవంటివే వాస్తు, సంఖ్యాశాస్త్రాదులు కూడ.

**3. కాలమనగా ఏమి?**

కాలము భగవత్ స్వరూపము. ఇది సూర్యచంద్రాది గ్రహముల గమనముబట్టి ఏర్పడుచున్నది. కాలము అందమైనది. మనదేశము కర్మభూయిష్టమైనది. ఎప్పుడేకార్యము జరిగించవలెనో అది తెలిసికొనుటకు కాలావశ్యకత ముఖ్యము.

కావున కాల స్వరూపము జ్యోతిశ్శాస్త్రంలో ఎంతగానో చోటుచేసుకొన్నది. కాలమువలననే మనము ఎప్పుడెన్ని గంటలు ఎన్ని నిమిషములైనది తెలిసికొనుచున్నాము.

**4. జాతకమనగా నేమి?**

పుట్టినవానియొక్క శుభాశుభములను జాతకము వలన తెలిసికొనవచ్చును. జీవి పుట్టినప్పుడు రాశి చక్రములో గ్రహము లెచ్చటెచ్చటనున్నది అట్లుండుటవలన ఆ జాతకునకు కలుగు నట్టి ఫలితములు ఎట్లుండునదియు ఇందుమూలమున తెలియ గలదు. అందువల్ల పుట్టినవానియొక్క సంపూర్ణ జీవిత విశేషములు జాతకము చూచి తెలిసికొనవచ్చును.

**5. క్రాంతి మండలము అనగా నేమి? దీనివల్ల లాభమేమి?**

ఖగోళమునందు అనగా ఆకాశ గోళమునందు సూర్యుడు పయనించు మార్గము, ఇయ్యది 360 భాగలు (డిగ్రీలు) గా విభజింపబడి యుండును. ఒక భాగదాటుటకు సూర్యునకు ఒకరోజు సమయము పట్టును. ఒక్కొక్క రాశికి 30 భాగలు.

దీనివలన కాలచక్రము తిరుగుట సంవత్సరములు, ఋతువులు, ఆయనములు, నెలలు, వారములు మొదలగునవి ఏర్పడుట జరుగుచున్నది.

**6. గ్రహములెన్ని ! అవి ఏవి ?**

గ్రహములు 9. అవి 1. రవి 2. చంద్రుడు 3. కుజుడు 4. బుధుడు 5. గురుడు 6. శుక్రుడు 7. శని 8. రాహువు 9. కేతువు.

**7. మనము కాలమును ఎట్లు విభజించుకొనుచున్నాము.**

పూర్వము లిప్తలు, విఘడియలు ఘడియల రూపంలో విభజించుకొనెడివారు, ప్రస్తుతం మనము సెకనులు, నిమిషములు గంటల రూపములో విభజన చేసికొను చున్నాము.

పాఠకులు రెండు పద్ధతులు కూడ తెలిసియుండవలెను.

| | | |
|---|---|---|
| 60 విఘడియలు | = | 1 ఘడియ (24 నిమిషాలు) |
| 60 ఘడియలు | = | 1 రోజు (24 గంటలు) |
| 60 సెకండ్లు | = | 1 నిమిషము. |
| 60 నిమిషాలు | = | 1 గంట |
| 24 గంటలు | = | 1 రోజు (ఒకపగలు, ఒకరాత్రి) |
| 30 రోజులు | = | 1 నెల |
| 12 నెలలు | = | 1 సంవత్సరం. |

ఈ విధముగాకాలమానము నెరుగునది.

**8. వారముల పేర్లేమి ? ప్రతి నామములేవి ?**

వారములు ఏడు.

| | | |
|---|---|---|
| 1. | ఆదివారము | భానువారము |
| 2. | సోమవారము | ఇందువారము |
| 3. | మంగళవారము | భౌమవారము |
| 4. | బుధవారము | సౌమ్య వారము |
| 5. | గురువారము | బృహస్పతి వారము |
| 6. | శుక్రవారము | భార్గవ వారము |
| 7. | శనివారము | మందవారము |

ఆదివారమును రవివారమనియు, గురువారము లక్ష్మివారమనియు, శనివారమును స్థిరవారమనియు కూడ అందురు. రవిహోరతో ప్రారంభించునది ఆదివారము. అట్లే మిగతా వారములు కూడా ఆయా హోరలతో ఉదయమగుచుండును.

**9. తెలుగు నెలలెన్ని ? వాటి పేర్లేమి ?**

తెలుగు నెలలు 12.

| | |
|---|---|
| 1. చైత్రము | 7. ఆశ్వయుజము |
| 2. వైశాఖము | 8. కార్తీకము |
| 3. జ్యేష్టము | 9. మార్గశిరము |
| 4. ఆషాఢము | 10. పుష్యము |
| 5. శ్రావణము | 11. మాఘము |
| 6. భాద్రపదము | 12. ఫాల్గుణము |

**10. ఇంగ్లీషు నెలలెన్ని ? అవి ఏవి ?**

| | |
|---|---|
| 1. జనవరి | 7. జూలై |
| 2. ఫిబ్రవరి | 8. ఆగష్టు |
| 3. మార్చి | 9. సెప్టెంబరు |
| 4. ఏప్రిల్ | 10. అక్టోబరు |
| 5. మే | 11. నవంబరు |
| 6. జూన్ | 12. డిశంబరు |

**11. కాలములెన్ని ? అవి ఏవి ?**

కాలములు మూడు – అవి 1. వేసవికాలము 2. వర్షాకాలము 3. చలికాలము (ఒక్కొక్కటి 4 నెలలు చొప్పున ఉండును.)

**12. ఋతువులెన్ని అవి ఏవి ?**

ఋతువులు ఆరు – 1. వసంత ఋతువు 2. గ్రీష్మ ఋతువు 3. వర్ష ఋతువు 4. శరదృతువు 5. హేమంత ఋతువు 6. శిశిర ఋతువు (ఇవి ఒక్కొక్కటి రెండు నెలల చొప్పున ఉండును.)

**13. తిథులు ఎన్ని? వాటి పేర్లేమి ?**

తిథులు 30 శుక్లపక్షంలో వచ్చు తిథులు 1. పాడ్యమి 2. విదియ 3. తదియ 4. చవితి 5. పంచమి 6. షష్ఠి 7. సప్తమి 8. అష్టమి 9. నవమి 10. దశమి 11. ఏకాదశి 12. ద్వాదశి 13. త్రయోదశి 14. చతుర్దశి 15. పూర్ణిమ.

బహుళ పక్షంలో 1 నుండి 14 వరకు ఆ తిథులు వచ్చును. చివర పూర్ణిమకు బదులుగా అమావాస్య వచ్చును.

**14. పక్షమనగా ఏమి? ఇవి నెలకెన్ని ?**

పక్షమనగా నెలలో ఒక భాగం. ఇవి రెండు భాగాలు. 1. శుక్లపక్షం – ఇవి వెన్నెల రాత్రులైన 15 రోజులు 2. బహుళపక్షం – ఇవి చీకటి రాత్రులైన 15 రోజులు.

**15. లగ్నము లెన్ని ? అవి ఏవి ?**

లగ్నములు 12. అవి 1. మేషము 2. వృషభము 3. మిధునము 4. కర్కాటకము 5. సింహము 6. కన్య 7. తుల 8. వృశ్చికము 9. ధనుస్సు 10. మకరము 12. కుంభము 12. మీనం.

**16. రాసులెన్ని ? అవి ఏవి ?**

రాసులు 12 ఇవి. అశ్విన్యాది నక్షత్రములకు ఏర్పడును. ఒక్కొక్క నక్షత్రమునకు 4 పాదములు చొప్పున 27 నక్షత్రాలకు 108 పాదములు. 9 పాదములు కలిసి ఒక రాశి అగును. వీటికి ఏర్పడ్డవి కూడ మేషం. మొదలగు లగ్నముల పేరులే.

**17. రాసులెట్లేర్పడుచున్నవి ?**

1. అశ్విని 4 పాదములు, భరణి 4 పాదములు, కృత్తికలో 1వ పాదము కలిసి మేషరాశి యగును.
2. కృత్తిక 2,3,4 పాదములు, రోహిణి 4 పాదములు, మృగశిరలో 1,2 పాదములు కలసి వృషభరాశి యగును.
3. మృగశిరలో 3,4 పాదములు, ఆర్ద్ర 4 పాదములు, పునర్వసులో 1,2,3 పాదములు కలిసి మిధునరాశి.

4. పునర్వసులో 4వ పాదము, పుష్యమి 4 పాదములు ఆశ్లేష 4 పాదములు కలసి కర్కాటకరాశి.
5. మఖ 4 పాదములు, పుబ్బ 4 పాదములు, ఉత్తరలో 1వపాదము కలసి సింహరాశి.
6. ఉత్తరలో 2,3,4 పాదములు. హస్త 4 పాదములు చిత్తలో 1,2 పాదములు కలసి కన్యారాశి.
7. చిత్తలో3,4 పాదములు స్వాతి 4 పాదములు విశాఖలో 1,2,3 పాదములు కలిసి తులారాశి.
8. విశాఖలో 4వపాదం అనూరాధ 4పాదములు జ్యేష్ట 4 పాదములు కలసి వృశ్చికరాశి.
9. మూల 4పాదములు, పూర్వాషాఢ 4 పాదములు, ఉత్తరాషాఢలో 1వపాదము కలసి ధనుస్సురాశి.
10. ఉత్తరాషాఢలో 2,3,4 పాదములు శ్రవణం 3 పాదములు ధనిష్టలో 1,2 పాదములు కలసి మకరరాశి.
11. ధనిష్టలో 3,4 పాదములు, శతభిషం 4 పాదములు, పూర్వాభాద్రలో 2,3 పాదములు కలసి కుంభరాశి.
12. పూర్వాభాద్రలో 4వపాదము, ఉత్తరాభాద్రలో 4వపాదము, రేవతి 4 పాదములు కలసి మీనరాశి యగును.

**18. తెలుగు సంవత్సరములు లెన్ని? వాటి పేర్లేమిటి ?**

తెలుగు సంవత్సరములు 60. అవి 1. ప్రభవ 2. విభవ 3. శుక్ల 4. ప్రమోదూత 5. ప్రజోత్పత్తి 6. అంగీరస 7. శ్రీముఖ 8. భావ 9. యువ 10. ధాత 11. ఈశ్వర 12. బహుధాన్య 13. ప్రమాది 14. విక్రమ 15. వృష 16. చిత్రభాను 17. స్వభాను 18. తారణ 19. పార్థివ 20. వ్యయ 21. సర్వజిత్తు 22. సర్వధారి 23. విరోధి 24. వికృతి 25. ఖర 26. నందన 27. విజయ 28. జయ 29. మన్మథ 30. దుర్ముఖి 31. హేవళంబి 32. విళంబి 33. వికారి 34. శార్వరి 35. ప్లవ 36. శుభకృత్ 37. శోభకృత్ 38. క్రోధి 39. విశ్వావసు 40. పరాభవ 41. ప్లవంగ 42. కీలక 43. సౌమ్య 44. సాధారణ 45. విరోధికృత్ 46. పరీధావి 47. ప్రమాదీచ 48. ఆనంద 49. రాక్షస 50. నళ 51. పింగళ 52. కాళయుక్తి 53. సిద్ధార్థి 54. రౌద్రి 55. దుర్మతి 56. దుందుభి 57. రుధిరోద్గారి 58. రక్తాక్షి 59. క్రోధన 60. అక్షయ.

**19. నక్షత్రమనగా ఏమి ?**

నక్షత్రమనగా నశింపులేనిది, అశ్విని నుండి రేవతి వరకును గల యీ 27 తారలు "భ" చక్రములోని మన గణనకు కావలసిన ముఖ్యమైనవి. ఇవి కాక ఇంకా ఎన్నో కోట్ల నక్షత్రములు కూడ భ చక్రములో కలవు.

**20. జన్మనక్షత్ర మనగా ఏమి? అది ఎట్లు తెలుసుకొనగల వీలగును ?**

జాతకుడు పుట్టిన కాలమునకు ఆ రోజున పంచాంగములో గుర్తింపబడిన నక్షత్రమే జన్మనక్షత్రము ప్రతిరోజూ సదరు తిధివద్ద వ్రాయబడిన నక్షత్రమందే చంద్రుండును.

**21. నక్షత్ర పాదమెట్లు తెలియును ?**

నక్షత్ర ప్రారంభము నుండి అది పూర్తియైన వరకు గల కాలమును 4చేత భాగించగా ఒక్కొక్క భాగము ఒక్కొక్క పాదమగును. మొదటి తొలిపాదము, ఆపైది రెండవది. పంచాంగములోని నక్షత్ర ప్రమాణము ద్వారా ఇది తెలియగలదు.

**22. నక్షత్రమున ఆకాశముపై ఎట్లు గుర్తుపట్ట గలము?**

| | | | |
|---|---|---|---|
| 1. | అశ్విని | గుఱ్ఱపు ముఖమువలె | 3 నక్షత్రములు |
| 2. | భరణి | పొయ్యి పొక్కిళ్ళ | 3 నక్షత్రములు |
| 3. | కృత్తిక | మంగలి కత్తి | 6 నక్షత్రములు |
| 4. | రోహిణి | బండిచక్రం | 5 నక్షత్రములు |
| 5. | మృగశిర | ధనువు | 3 నక్షత్రములు |
| 6. | ఆర్ద్ర | పగడము | 1 నక్షత్రములు |
| 7. | పునర్వసు | పడవ | 7 నక్షత్రములు |
| 8. | పుష్యమి | పొట్లపువ్వు | 3 నక్షత్రములు |
| 9. | ఆశ్లేష | పాము | 6 నక్షత్రములు |
| 10. | మఖ | పల్లకీబొంగువలె | 5 నక్షత్రములు |
| 11. | పుబ్బ | కండ్ల | 2 నక్షత్రములు |
| 12. | ఉత్తర | కండ్ల | 2 నక్షత్రములు |
| 13. | హస్త | అరచేయి | 5 నక్షత్రములు |
| 14. | చిత్త | ముత్యము | 1 నక్షత్రము |
| 15. | స్వాతి | మాణిక్యము | 1 నక్షత్రము |
| 16. | విశాఖ | కుమర్మిసారె | 5 నక్షత్రములు |

| | | | |
|---|---|---|---|
| 17. | అనూరాధ | గొడుగుకర్ర | 5 నక్షత్రములు |
| 18. | జ్యేష్ట | గొడుగు కర్ర | 5 నక్షత్రములు |
| 19. | మూల | అంకుము | 6 నక్షత్రములు |
| 20. | పూర్వాషాఢ | విరిగిన మంచపుకోళ | 2 నక్షత్రములు |
| 21. | ఉత్తరాషాఢ | విరిగిన మంచపు కోళ్ళు | 2 నక్షత్రములు |
| 22. | శ్రవణం | వేణువు | 3 నక్షత్రములు |
| 23. | ధనిష్ట | మద్దెన | 4 నక్షత్రములు |
| 24. | శతభిషం | నగరం | 100 నక్షత్రములు |
| 25. | పూర్వాభాద్ర | విరిగిన మంచంకోళ్ళు | 4 నక్షత్రములు |
| 26. | ఉత్తరాభాద్ర | విరిగిన మంచంకోళ్ళు | 4 నక్షత్రములు |
| 27. | రేవతి | చేట | 7 నక్షత్రములు |

**23. అవకహడ చక్రమనగా నేమి ?**

జన్మనక్షత్రం తెలియని వారికోసం పేరునుబట్టి నక్షత్రమును తెల్పు పట్టిక, శివుడు పార్వతీదేవికి ఉపదేశించిన శాస్త్రమిది.

ఉదా:- చూ-చె-చో-లా అశ్విని యిందలి 4 పాదములు అశ్వినికి చెందును. యిట్లే నక్షత్రములకు 108 అక్షరములుండును. పేరులోని మొదటి అక్షరము ద్వారా నామనక్షత్ర మెరుగుటకై యిది ఏర్పడ్డది.

**24. నామ నక్షత్ర మనగానేమి? ఇది ఎట్లు ఏర్పడును ?**

పేరునబట్టి నక్షత్రమును నిర్ణయించుకొనుట, నామనక్షత్ర పట్టికలో ఒక్కొక్క నక్షత్ర పాదములకు ఒక్కొక్క అక్షరము గుర్తింపబడి యుండును. మీ పేరులోని మొదటి అక్షరం ఎచ్చట గలదో దానిని చూచి సదరు నక్షత్రములో సదరుపాదం అని తెలియ వచ్చును.

**25. నామనక్షత్ర పట్టిక ఎట్లుఏర్పడగలదు?**

| నక్షత్రము | పాదాక్షరములు |
|---|---|
| పాదములు | 1-2-3-4 |
| అశ్విని | చూ-చే-చో-లా |
| భరణి | లీ-లు-లె-లో |
| కృత్తిక | ఆ-ఈ-ఊ-ఏ |
| రోహిణి | ఓ-వా-వీ-వూ |

| | |
|---|---|
| మృగశిర | వే–వో–కా–కి |
| ఆర్ద్ర | కు–ఘ–ఙ–ఛా |
| పునర్వసు | కె–కో–హా–హి |
| పుష్యమి | హు–హే–హో–డా |
| ఆశ్లేష | డి–డు–డె–డో |
| మఖ | మా–మి–మూ–మే |
| పుబ్బ | మో–టా–టి–టూ |
| ఉత్తర | టె–టో–పా–పి |
| హస్త | పూ–ష–ణా–ఠా |
| చిత్త | పె–పో–రా–రి |
| స్వాతి | రూ–రే–రో–తా |
| విశాఖ | తీ–తూ–తే–తో |
| అనూరాధ | నా–నీ–నూ–నే |
| జ్యేష్ట | నో–యా–యి–యూ |
| మూల | యె–యో–బా–బి |
| పూర్వాషాఢ | బు–ధ–భ–ఢా |
| ఉత్తరాషాఢ | బి–బో–జా–జి |
| శ్రవణం | బే–జె–జో–ఖా |
| పూర్వాభాద్ర | సే–సో–దా–ది |
| ఉత్తరాభాద్ర | డు–శ్యం–ఝా–థా |
| రేవతి | దే–దో–చా–చి |
| అభిజిత్తు | ఖ–ఖి–ఖు–ఖే |

**26.** కొన్ని ప్రత్యేక తారలేవి ?

| | |
|---|---|
| కృష్ణ=మృగ 3వ పాదము | జ్ఞాన=ఆర్ద్ర 3 పాదము |
| హృష్ణ=స్వాతి 1వ పాదము | భీమ=మూల 3 పాదము |
| శ్రీధర=చిత్త 4వ పాదము | భైరవ=పూషా 3 పాదము |
| క్షేత్రయ్య=హస్త 2పాదము | ప్రభాకర్=చిత్త 3 పాదము |

**27. యోగములెన్ని ? అవి ఏవి?**

1. విష్కంభము 2. ప్రీతి 3. ఆయుష్మాన్ 4. సౌభాగ్యము 5. శోభనము 6. అతిగండము 7. సుకర్మము 8. ధృతి 9. శూల 10. గండము 11. వృద్ధి 12. ధృవము 13. వ్యాఘాతము 14. హర్షము 15. వజ్రము 16. సిద్ధి 17. వ్యతీపాత్ 18. వరీయాన్ 19. పరిగ 20. శివము 21. సిద్దము 22. సాధ్యము 23. శుభము 24. శుక్లము 25. బ్రహ్మము 26. ఐంద్రము 27. వైధృతి.

**28. వ్యర్జమనగా ఏమి? దీని పరిమిత కాలమెంత ?**

నక్షత్రమునకు వచ్చు దోషమును వర్జమందురు. ఒక్కొక్క నక్షత్రమునకు ఒక్కొక్క విధముగా వచ్చుచుండును. దీనికి త్యాజ్య కాలమని యింకొక పేరుగలదు. దీని ప్రవేశము నుండి 4 ఘడియలు (అనగా 1 గంటా36నిముషాలు) విడిచి పెట్టి ఆపై శుభకార్యములు చేసికోవచ్చును. త్యాజ్య కాలములో ఎట్టి శుభకార్యములు నిర్ణయించుకోరాదు. కనుక అన్ని నక్షత్రాలకు విడువవలసిన కాలములను యీ దిగువ పొందుపరచుచున్నాము.

| | **నక్షత్రములు** | **త్యాజ్య ఘడియలు** |
|---|---|---|
| 1. | అశ్విని | 50 ఘడియలపైన |
| 2. | భరణి | 24 ఘడియలపైన |
| 3. | కృత్తిక | 30 ఘడియలపైన |
| 4. | రోహిణి | 40 ఘడియలపైన |
| 5. | మృగశిర | 14 ఘడియలపైన |
| 6. | ఆర్ద్ర | 21 ఘడియలపైన |
| 7. | పునర్వసు | 30 ఘడియలపైన |
| 8. | పుష్యమి | 20 ఘడియలపైన |
| 9. | ఆశ్లేష | 32 ఘడియలపైన |
| 10. | మఖ | 30 ఘడియలపైన |
| 11. | పుబ్బ | 20 ఘడియలపైన |
| 12. | ఉత్తర | 18 ఘడియలపైన |
| 13. | హస్త | 24 ఘడియలపైన |
| 14. | చిత్త | 20 ఘడియలపైన |
| 15. | స్వాతీ | 14 ఘడియలపైన |

| | | |
|---|---|---|
| 16. | విశాఖ | 14 ఘడియలపైన |
| 17. | అనూరాధ | 10 ఘడియలపైన |
| 18. | జ్యేష్ట | 14 ఘడియలపైన |
| 19. | మూల | 20 ఘడియలపైన |
| 20. | పూర్వాషాడ | 24 ఘడియలపైన |
| 21. | ఉత్తరాషాడ | 20 ఘడియలపైన |
| 22. | శ్రవణం | 10 ఘడియలపైన |
| 23. | ధనిష్ట | 10 ఘడియలపైన |
| 24. | శతభిషం | 18 ఘడియలపైన |
| 25. | పూర్వాభాద్ర | 16 ఘడియలపైన |
| 26. | ఉత్తరాభాద్ర | 16 ఘడియలపైన |
| 27. | రేవతి | 20 ఘడియలపైన |

**29. దుర్ముహూర్తమనగా నేమి? ఇది ఎట్లేర్పడుచున్నది?**

వారమునకు సంబంధించిన దోషము ఇది సూర్యోదయము 6 గంటలకయ్యేటప్పుడు దుర్ముహూర్త మీ విధముగా వచ్చును. దీని ప్రమాణం 48 నిమిషాలు, ఆదివారం సాయంత్రము 4-32కు. సోమవారం మధ్యాహ్నం 12-28 మరల 2-58కు మంగళవారం ఉదయం 8-30కు, మరల రాత్రి 11-50కు, బుధ వారం ఉదయం 11-41కు, గురువారం మధ్యాహ్నం 2-54కు, శుక్రవారం మధ్యాహ్నం 12-28కు శనివారం ఉదయం 2-40కు దుర్ముహూర్తం వచ్చుచుండును. ఘడియల్లో ఆది-26, సోమ-16,22 మంగళ-6 మరల రాత్రి 11-50 బుధవారం-11ఘ, గురువారం-10, శుక్ర-16 శని-4 ఘడియలకు వచ్చును.

**30. లగ్నమునకు గల ప్రమాణము లెంతెంత ?**

| | | | |
|---|---|---|---|
| మేషం | - 1 గం.44 ని॥లు | తుల | - 2 గం 10 ని॥ |
| వృషభం | - 1-55 | వృశ్చికం | - 2-11 |
| మిధునం | - 2-16 | ధనుస్సు | - 2-08 |
| కర్కాటకం | - 2-08 | మకరం | - 1-53 |
| సింహం | - 2-08 | కుంభం | - 1-40 |
| కన్య | - 2-06 | మీనం | - 1-34 |

**31. తారాబలమెట్లు తెలియును ? దీనివల్ల లాభమేమి ?**

జన్మలేక నామనక్షత్రము లగాయితూ నిత్యనక్షత్రం వరకును లెక్కించి దానిని 9చే భాగించగా మిగిలిన శేషం 1. జన్మతార 2. సంపత్తార 3. విపత్తార 4. క్షేమతార 5. ప్రత్యక్తాక 6. సాధనతార 7. నైధనతార 8. మిత్రతార 9. పరమ మిత్రతార సున్న శేషం వచ్చిన అది పరమ మిత్రతారగా ఎరుగవలెను. ఇందు బేసి తారలు అశుభ ఫలితాలు. సరిసంఖ్యగల తారలు శుభఫలితములను కలిగించును. ఒక్క బేసి తారయైన 9వది మాత్రం శుభఫలమిచ్చును.

**32. ఏ ఏ తారలు ఎట్టి ఫలితం లిచ్చును ?**

1. జన్మతార–శరీరశ్రమను 2. సంపత్తార - ధనలాభమును 3. విపత్తార–ప్రమాదమును 4. క్షేమతార–సౌఖ్యమును 5. ప్రత్యక్తార–చిక్కులను 6. శోభనతార–కార్యసిద్ధిని 7. నైధనతార–ఖర్చులను 8. మిత్రతార–స్నేహమును 9. పరమ మిత్రతార–లాభములను కలుగజేయును.

తారాబలమువల్ల ఫలితం కావలసిననాటి శుభాశుభములు తెలియగలవు. అవి తెలిసికొని తగినవిధంగా సంచరించుటకు వీలగును. తారాబలం బాగులేనినాడు ప్రయత్నములు విరమించుట, ప్రమాణములు విడచిపెట్టుట. శుభకార్యములకు పూనుకొనకపోవుట, అది అనుకూలించినప్పుడు ముఖ్య ప్రయత్నములు సిద్ధించును. కావున నెరవేర్చుకొనుట ఉద్యుక్తులగుట చేయదగినది. నైధనతార ఎల్లప్పుడు విడువదగినది.

**33. చంద్రబలమెట్లు తెలిసికొందము? దీని ఆవశ్యకత ఏమి ?**

తన జన్మ లేక నామరాశి నుండి చంద్రుడున్న నిత్య రాశివరకు లెక్కించిన 1–3–6–7–10–11 రాశులలో చంద్రుడుండగా శుభఫలమిచ్చును. మిగతా రాసులలో అశుభఫలమిచ్చును. విశేషించి శుక్లపక్షమునందు 2–5–9 స్థానములలోను బహుళ పక్షమున 4–6–12 స్థానములలోను తల్లి కుమారులను రక్షించునట్టు రక్షించును. అష్టమ చంద్రుడు ఎల్లప్పుడు దుష్ట ఫలములనే యిచ్చును.

తారా, చంద్ర బలములు రెండును శుభకార్యములు జరిగించునపుడు ప్రయాణములు చేయునపుడు, ముఖ్య కార్య ప్రయత్నములు ప్రారంభించునపుడు తప్పక చూచుకొనవలెను. ఇవి బాగులేనిచో అశుభ ఫలములు ఎదుర్కొనవలసి వచ్చును.

**34. పుష్కర కాలముల ఉపయోగమేమి ?**

ఒక్కొక్క లగ్నములో ఒక్కొక్క భాగం చాలా ఉత్తమమయినది, అదే పుష్కరకాలం

వివాహాది శుభకార్యములు జరిగించుటకు ప్రశస్తమైన వీటి గురించి అందుకే తెలిసికొనుట ముఖ్యమైనది.

మేషలగ్న పుష్కరకాలం 2 ఘడి 58 విఘడియలకు వృషభలగ్న-2-3 మిధున 4-9, కర్కాటక 1-6 సింహం 3-88, కన్య 2-16, తులా4-8, వృశ్చిక 1-6, ధనుస్సు3-32, మకర 1-53, కుంభం 3-11, మీనం 0-48.

**35. పంచకరహిత మనగా ఏమి?**

ముహూర్తం ఏర్పరచుకొను నాటికి తిథి, వార, నక్షత్ర లగ్న సంఖ్యలను కలిపిన మొత్తమును 9చేత భాగించగా శేషము 3-5-7-9 ఉన్న ముహూర్తములు రహితమైనవని గ్రహించవలెను. 1 మిగిలిన మృత్యు పంచకం అగ్నిపంచకం, 4 రాజపంచకం, 6 చోరపంచకం, 8 రోగపంచకం ఇవి దోషకరమైనవి.

**36. కొన్ని నక్షత్రములకు రెండేసి పేర్లు చొప్పున ఉంటున్నవి అవి ఏవి?**

ఉత్తరకు-ఉత్తర ఫల్గుణి, పుబ్బ-పూర్వ ఫల్గుణి, ఆశ్లేష-అశ్రేష చిత్ర - చిత్త, శతభిష-శతతార.

మరికొన్ని విశేషాలు :- పౌర్ణమికి-పూర్ణిమ, కర్కాటకము-కటకము, ఉత్తరా త్రయము-ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ధనిష్టా పంచకము-ధనిష్ట శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.

**37. నవకము అనగానేమి? దీనిని తెలిసికొనుటవల్ల లాభమేమి ?**

నవకము అనగా తొమ్మిది నక్షత్రముల సమూహం మొత్తం 27 నక్షత్రములు 3 నవకములుగా విభజింపబడ్డవి. పుట్టిన నక్షత్రము మొదలు 9 నక్షత్రములు మొదటి నవకము, ఆపై వచ్చు 9 తారలు 2వ నవకము. పిమ్మట వచ్చు 9 తారలు తృతీయ నవకము, తొలి నవకములో జన్మతార చెడ్డది. దీనికి శాకము. రెండవ నవకములోని విపత్తార చెడ్డది. దీనికి బెల్లము, మూడవ నవకములో వచ్చు ప్రత్యక్తార చెడ్డది. దీనికి ఉప్పు దానమీయవలెను. అన్ని నవకములలోను వచ్చు నైధనతార చెడ్డది. ఇది నువ్వులతో కూడిన బంగారం దానముతోగాని నివర్తికాజాలదు. విడువ వలసిన కాలము-జన్మ తారకు 7 ఘడియలు (తొలి 2 గంటలా 12 ని.లు) విపత్తారకు 3 ఘ॥లు (1గంట 12 ని॥లు ప్రత్యక్తారకు 3 ఘ॥లు (1 గం॥ 12 ని॥లు)నైధవతారకు 8 ఘ॥లు (తొలి 3 గం॥ 12 ని॥లు)

**38. శూన్యమాస మనగా ఏమి? దీనికి మంచి చెడ్డలేవి ?**

ఎటువంటి శుభకార్య మాచరించుటకు దూష్యమైనది, శూన్యమాసం, ఆషాఢం,

భాద్రపదము, పుష్యం ఇవికాక మీన, చైత్రము, మిధునాషాఢము, కన్యాభాద్రపదము, ధనుఃపుష్యము, ఇవి శూన్యమాసములే సూర్యుడు ఆయా రాసులలో ఉన్నప్పుడు శుభ కార్యముల గూర్చి తలపెట్టరాదు.

**39. మూఢము లేక మౌఢ్యమి అనగా ఏమి ?**

రవితో కలసి గురు శుక్రులలో ఎవరైనను చరించు వేళను మూఢమందురు. అస్తంగత్వ దోషము ప్రాప్తించుటచేత శుభమీయజాలని కాలమిది కావున ఎట్టి శుభకార్యములైనను ఈ కాలములో జరిగించరాదు.

**40. కర్తరి అనగా ఏమి? ఏఏ కార్యములిందు జరిగించరాదు ?**

కర్తరి అనగా సూర్యుడు భరణి 4పాదమున కృత్తిక 4వ పాదములలోను, రోహిణి 1వ పాదమున సంచరించు కాలమును కర్తరి అందురు. భరణీ 4వపాదము డొల్లుకర్తరి అంత చెడ్డదికాదు. మిగతా కాలమంతయు చాల చెడ్డది. గృహనిర్మాణాది కార్యములు, నుయ్యి త్రవ్వుట దేవతా ప్రతిష్ఠ మొదలగు ఈ కాలంలో చేయరాదు.

**41. పంచాంగము అనగా నేమి ?**

పంచాంగము అనగా 5 అంగములు గలది అని అర్థము. 1.తిథి 2.వారం 3. నక్షత్రం 4. యోగం 5. కరణం సిద్ధాంత పంచాంగములలో ప్రతిరోజు వీని ప్రమాణం గుర్తించబడి యుండును. ఈ పంచాంగములు పెద్దసైజులో ఉంటాయి. ఇక గంటల పంచాంగం పాకెట్ సైజులో ఉండును. ఇందు యోగ కరణాదులుండవు. మొత్తంమీద పంచాంగము ప్రతియింట యుండదగిన పవిత్ర గ్రంథము. ప్రతి నిముషము దీని ఉపయోగముండును.

**42. గోచారమనగా ఏమి ?**

గ్రహములు ఒకరాశి నుండి ఇంకొక రాశికి మారుతూంటాయి. దీనినే గోచారమంటారు. నవగ్రహములు "భ" చక్రమార్గమున సంచరించుచుండును. ఆ 'భ' చక్రమును 12 భాగములు చేయగా 12 రాసులైనవి. మేషం నుండి మీనం వరకునుగల 12 రాసులే లగ్నములుగా కూడ పిలువబడుచున్నవి. దీనికి ఇంకొక పేరు గ్రహచారం ఆకాశముపై కోట్లకొలది నక్షత్రం లున్నప్పటికి మనకు కావలసినవి 28 నక్షత్రములు మాత్రమే. అవి అశ్వని నుండి రేవతి వరకును గలవి మాత్రమే అని ఎరుగవలెను. ఒక్కొక్క నక్షత్రమునకును 4 పాదములనియు 9 పాదములు కలిసి ఒక రాశి అగుననియు మీరిదివరకే తెలిసికొని యున్నారు.

**43. గోచారం తెలిసికొనుటవలన మనకు కలుగు లాభమేమి ?**

గ్రహములయొక్క కిరణ ప్రసారమునందలి శక్తియే సర్వజీవుల జీవనాధారానికి మూలకారణమై యున్నది. అది వారి వారి కర్మ ఫలములను బట్టి సుఖదుఃఖములను కలుగుజేయును. అందుచేత గ్రహచలనం వల్ల మంచి చెడు - లెక్కల ప్రకారం కలుగుచుండగలవు.

**44. గ్రహ గమన విధాన మెట్లుండును ?**

ఒక్కొక్క రాశిలో రవి, బుధ, శుక్రులు 30 రోజుల చొప్పునను, కుజుడు 45 రోజులు, గురుడు 1 సం॥రం. రాహు కేతువులు 1న్నర సంవత్సరములు, శని 2న్నర సంవత్సరముల కాలముండును.

**45. గ్రహ గుణములు వివరింపుము ?**

సూర్య, చంద్ర, గురులు సత్వగుణము గలవారు కుజ, శని, రాహు, కేతువులు తమోగుణులు, బుధ, శుక్రులు, రజోగుణ ప్రధానులు.

**46. గ్రహకారకత్వ ఫలములేమి ?**

గ్రహములు మానవులపై వాని బలములను, శుభాశుభఫలితములను కలిగించు చుందురు. రవి ఆత్మ, పితృ చింత ఉద్యోగం, కఫం, శిరోవ్యాధి, అధికారమున్నూ చంద్రుడు బుద్ధి మనస్సు, స్త్రీ సౌందర్యం, మాతృచింత, క్షయ, నిద్ర కుజుడు సోదర వర్గము, భూమి విరోధులు విదేశ గమనం, బుధుడు గణితం. జ్యోతిషం, వ్యాపారం, వైద్యం రత్న పరీక్ష గురుడు ధనం, సంతానం, వాహనం, భూగృహ పశులాభములు- శుక్రుడు వివాహం, కళత్రం, క్రయ, విక్రయ నైపుణ్యం, శని ఆయుర్దాయం, హూణ, శిల్ప విద్యలు, నీ జీవనము, జూదప్రీతి రాహువు, మంత్రతంత్రములు, వైద్యరత్న పరీక్ష, మాతామహ విషయము, అన్యదేశ గమనము, కేతువు మోక్షాపేక్ష, గంగాస్నానము విషాదము, వైరాగ్యం కలిగించును

**47. సూర్యగ్రహణ మెట్లేర్పడుచున్నది?**

భూమికి సూర్యునికి మధ్య చంద్రుడు అడ్డువచ్చి చంద్రునినీడ సూర్యునిపై పడుట వలన సూర్యగ్రహణం ఏర్పడుచున్నది. రాహు కేతువులు సూర్యచంద్రులను మ్రింగుదురని పురాణగాథ.

**48. కార్తి అనగా ఏమి?**

వర్షయోగమును తెల్పు విశేషము అశ్వీన్యాది కార్తెలు రేవతి పర్యంతం సంవత్సరములో 27న్నూ ఒకసారి నడచును, కార్తె ప్రవేశ కాలమును బట్టి సువృష్టి, అనావృష్టి, చిత్రవృష్టి మొదలగునవి ఒక్కొక్కటి సంభవమగును.

**49. అక్షాంశములనగా ఏమి ?**

భూమధ్యరేఖకు ఉత్తరమున 90 భాగలు. దక్షిణమున 90 భాగలును, ఇవి లగ్న ప్రమాణములు మొదలగు అంశములకు సంబంధించినవి.

**50. తారాభేదములు వివరింపుము ?**

సూర్యుడున్న నక్షత్రము మొదలు 7 తారలు నిర్జీవ తారలు ఆపై 12 తారలు జీవతారలు తర్వాతి తారలు రోగతారలు జీవతారలు ఉత్తమమైనవి.

**51. ఆయన మనగా ఏమి ?**

సూర్యుడు ఉత్తరం నుండి దక్షిణమునకు దక్షిణము నుండి ఉత్తరమునకు జరుగుటను ఆయనమందురు. దీనికిపట్టు కాలం 6 మాసములు 1 ఉత్తరాయణం 2 దక్షిణాయనం.

**52. అనంత విశ్వమనగా ఏమి?**

సౌరమండలపు అంచులను దాటి అంతటా నిండినది గ్రహణము లన్నియు ఇందులోనే తిరుగాడు చుండును.

**53. అహోరాత్రములు అనగానేమి ?**

ఒక పగలును ఒక రాత్రియును కలసి 1 రోజు అగును. దీనినే అహోరాత్రములు అందురు. ఇది కాలగణనకాధార భూతమైనది. సూర్యుడు 1 డిగ్రీ మించుటకు పట్టుకాలం భూమి తనలో తాను ఒకసారి తిరుగుటకు పట్టుకాలం.

**54. అహస్సు అనగా ఏమి?**

పగటికాలం అహస్సు అందురు సూర్యుడు కనిపించు 12 గంటల కాలమిది. దీనిని ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం అను 3 భాగములు చేసి పిల్చుచుందుము.

**55. ఆయుర్దాయం నిర్ణయములోని రకములను తెల్పుము ?**

పుట్టినది మొదలు 32 సం॥ల వరకును అల్పాయువు. అది మొదలు 75 సం॥వరకు మధ్యమాయువు ఆపై 120 సం॥ వరకును పూర్ణాయువు, పుట్టినది మొదలు 8 సం॥లు వరకు బాలారిష్టం.

**56. ఉచ్ఛ అనగా ఏమి?**

రాశిచక్రములో ఆయా గ్రహములకు ఏర్పడిన స్థాన విశేషం ఇది మేలు కలిగించును. ఉదా:- రవికి మేషం చంద్రునకు వృషభం మొదలగునవి గ్రహించేది.

**57. అంశ చక్రమనగా ఏమి?**

అంశచక్రం జాతక సంబంధమైనది. రాశి చక్రంలో వలె జీవిత ఫలములు తెలిసికొనుటకు ఉపయోగపడు చక్రం, అశ్విని 1వపాదం, మేషాంశమనియు, 2వ పాదం వృషభాంశ మనియు 3వపాదం మిధునాంశమనియు 4వపాదం కటకాంశ మనియు ఈవిధముగా ఏర్పడును.

**58. ఉదయరాశి అనగా ఏమి?**

రవి ఏ రాశియందుండునో ఆ రాశి ఉదయలగ్న మగుచున్నది. ఆ లగ్నం నుండి వరుసగా వచ్చు 6 లగ్నములు సాయంకాలం వరకును ఆపైవచ్చు 6 లగ్నములు రాత్రి పూర్తియగు వరకు వచ్చి ప్రతిదినం ఏర్పడుచున్నది.

**59. ఋక్షాద్యంతము అనగా ఏమి ?**

నక్షత్ర ప్రమాణం ఏ నక్షత్రమైనను 66–40 ఘడియలకు మించిగాని 55–50 ఘడియలకు తగ్గిగానీ యుండదు. పూర్వనక్షత్రం కంటె జననకాల నక్షత్రం పెరిగిన యెడల 60లో ఆ పెచ్చు సంఖ్యను కలుపవలెను. పూర్వ నక్షత్రం కంటె జననకాల నక్షత్రం తగ్గిన యెడల 60లో ఆ తగ్గు సంఖ్య తీసి వేయవలెను.

ఋక్షాద్యంతం 67–53 ఘడియల మధ్యకాలములో ఉండునని కొందరి అభిప్రాయం.

**60. ద్వాదశ భావస్థానములను తెల్పుము ?**

జన్మలగ్నం తమ స్థానం, ద్వితీయం ధనస్థానం తృతీయం సోదర, చతుర్ధం మాతృ పంచమము పుత్ర, షష్ఠమం శత్రు, సప్తమం, కళత్ర, అష్టమం, ఆయుః నవమం పితృ దశమం కర్మ ఏకాదశం జ్యేష్ట, భాతృ ద్వాదశం వ్యయ భావములను తెల్పును.

**61. త్రిజ్యేష్ట విచారణ అనగా ఏమి ?**

తొలుచూలు వరుడు, తొలిచూలు కన్యక జ్యేష్ట మాసం వీటి మూడింటిని త్రిజ్యేష్ట అని అందురు. వీనిలో ఒక జ్యేష్టం శుభకరం రెండు జ్యేష్టములు మధ్యమం. మూడు జ్యేష్టములు హాని. కాని తొలుచూలు వరకు ద్వితీయాది గర్భజాతయగు కన్యను తొలిచూలు కన్య ద్వితీయాది గర్భజాతకుడగు వరుని పెండ్లాడు నపుడు జ్యేష్టమాసం శుభకరమైనదే.

**62. అంగారక దోషమనగా ఏమి?**

దీనికే కుజదోషమని ఇంకొక పేరు, ఇది వివాహ విషయమున భార్యాభర్తలకు సంబంధించినది. 2–4–7–8–12 రాసులలో కుజుడున్న పురుషుల కైనను స్త్రీలకైనను

దోషం ఈ కుజదోషం జన్మలగ్నం చంద్రరాశి శుక్రస్థితి నుండి క్రమముగా బలవత్తరం. మేష కర్కాటక సింహ వృశ్చిక ధనుర్మకర మీనరాసుల యందు జన్మించిన వారికి కుజదోషం లేదు. మిధున కన్యారాసులందు జన్మించిన వారికి 2వ యింట నున్న కుజదోషములేదు, మేష వృశ్చిక రాసులందు జన్మించిన వారికి 4వ యింట ఉన్న కుజదోషం లేదు. కటక మకర రాసులవారికి 7ట కుజుడున్న దోషంలేదు. ధను మీనరాసులవారికి అష్టమమందలి కుజదోషం లేదు.

కుజుడు గురునిలో కలిసియున్నను గురువుచే చూడబడినను కుజదోషం లేదు పురుషులకు 2,7, స్త్రీలకు 4.,8 రాసులందు కుజుడున్న ఎక్కువ దోషం లేదు పురుషులకు స్త్రీలకు అష్టమమున మహాదోషం దంపతులలో ఏ ఒక్కరికి కుజదోషమున్నను హానికరమైనదే.

**63. కోణము లనగా ఏమి ?**

లగ్నమునుండి పంచమ నవమ స్థానములు ఇందున్న గ్రహములు శుభఫలమిచ్చుటకు సమర్థులు.

**64. గ్రహగతుల విధము తెల్పుము?**

1. వక్రం 2. అతిచారం 3. స్థంభన 4. అస్తంగత్వం 5. సమాగమము.

**65. గ్రహ సమయములెన్ని ? అవి ఏవి ?**

ఇవి 27. 1. స్నానసమయం 2. వస్త్రధారణ 3. తిలకధారణ 4. జపసమయం 5. శివపూజ 6. హోమసమయం 7. విష్ణు పూజా 8. విప్రపూజ 9. నమస్కార 10. అద్రి ప్రదక్షణ 11. వైశ్యదేవ 12. అతిధి పూజ 13. భోజన సమయం 14. విద్యాప్రసంగ 15. అక్రోశ 16. తాంబూల 17. వృపసల్లాప 18. కిరీటధారణ 19. జలపాన 20. అలస్య 21. నయన 22. అమృతాశన 23. అలంకరణ 24. స్త్రీ సల్లాప 25. భోగ 26. నిద్రా 27. రత్న పరీక్షా సమయం.

**66. గ్రహముల దృష్టి నిర్ణయ మెట్లుండును ?**

సూర్యాది నవగ్రహములున్నూ 7వ స్థానమును సంపూర్ణ దృష్టితో చూచెదరు. శని 3-4-10 స్థానములను గురుడు 5-9 స్థానములను, కుజుడు 4-8 స్థానములను కూడ చూచెదరు.

**67. గ్రహజప సంఖ్య ఎట్లుండును?**

రవికి 6వేలు, చంద్రునికి పదివేలు, కుజునికి 7వేలు రాహువుకి 18వేలు బుధునికి 17వేలు గురునికి 16వేలు శుక్రునికి 20 వేలు శనికి 19వేలు, కేతువునకు 7వేలు.

**68. గ్రహముల స్వభావము లెట్టివి?**

రవి అర్థపాపి, చంద్రుడు శుభుడు, కుజుడు త్రిపాద పాపి బుధుడు అర్థశుభుడు, గురుడు పూర్ణశుభుడు, శుక్రుడు త్రిపాద శుభుడు, శని, కేతువులు పూర్ణ పాపులు.

**69. గ్రహములకు గల షడ్బలం లేవి ?**

1. స్థాన బలం 2. దిగ్బలం 3. చేష్టాబలం 4. కాలబలం 5. నైసర్గిక బలం 6. దిగ్బలం. ఈ 6 బలములను పరిశీలించి జాతక ఫలములు చెప్పవీలున్నది.

**70. గ్రహ జాతులు వివరింపుము ?**

గురు శుక్రులు బ్రాహ్మణులు, శని కుజులు క్షత్రియులు, చంద్రుడు వైశ్యుడు, బుధుడు శూద్రుడు, శని చండాలుడు, బుధుని వైశ్యునిగ, శనిని శూద్రునిగ, రాహువును మ్లేచునిగ చాలమంది చెప్పుదురు.

**71. గ్రహకళ లెట్లుండును ?**

సూర్యునికి 30. చంద్రునికి 18, కుజునికి 6, బుధునకు 8, గురునికి 10, శుక్రునకు 12, శనికి 1 చొప్పున కళలు ఉండును.

**72. గ్రహస్ఫుట మనగా నేమి?**

గ్రహం స్థితి పొందిన నక్షత్ర ప్రవేశ సమయం నుండి తర్వాత నక్షత్రమందు ప్రవేశించు సమయం వరకును గల మధ్యకాలము.

**73. గ్రహావస్థలు ఎన్ని ? అవి ఏవి?**

గ్రహావస్థలు 10, అందు 1. దీప్తావస్థ 2. స్వస్థ 3. ముదిత 4. శాంత 5. శక్తి 6. పీడితి 7. దీన 8. వికల 9. కల 10. భీతావస్థలు.

ఉచ్ఛయందుగల గ్రహములు దీప్తావస్థను స్వక్షేత్రమందు గలవి. స్వస్థావస్థను, మిత్ర క్షేత్రములుగలవి. ముదితా వస్థను సమక్షేత్రమందుగలవి, శాంతావస్థను వక్ర గ్రహం, శక్తావస్థను రాశి తుదిభాగమందలి గ్రహం. పీడితావస్థను శత్రుక్షేత్రముల గలది. దీనావస్థను అస్తమించు గ్రహం. వికలావస్థను అతిచారం గలది భీతావస్థను పొందుచున్నవి.

**74. గ్రహవర్ణం లెతిగింపుము ?**

రవి తామ్రవర్ణం, చంద్రుడు తెల్లని వర్ణము, కుజుడు ఎరుపు, బుధుడు హరిత, గురుడు పీత, శుక్రుడు కర్పూర, శని కృష్ణ వర్ణములు కలిగియుందురు. రాహువు కృష్ణ లోహితము, కేతువు చిత్రవర్ణం గలవాడు.

**75. గ్రహ గుణములను తెల్పుము ?**

సూర్యచంద్ర గురులు సత్యగుణం గలవారు కుజ, శని, రాహు, కేతువులు తమోగుణులు, బుధ,శుక్రులు, రజోగుణ ప్రధానులు.

**76. గ్రహధాతువులను వివరింపుము?**

రవికి ఎముకలు, చంద్రునకు రక్తము, కుజునకు శిరోధాతు, బుధునకు చర్మం, గురునకు మేధస్సు, శుక్రునకు గుహ్యం, శని స్నాయువు ధాతువులు.

**77. గ్రహదిక్కులను తెల్పుము?**

రవి తూర్పు, చంద్రుడు వాయువ్యం, కుజుడు దక్షిణము బుధుడు ఉత్తరం గురుడు ఈశాన్యం, శుక్రుడు ఆగ్నేయం శని పశ్చిమం, రాహువు నైరుతి, కేతువు నైరుతి.

**78. గ్రహపాటు అనగా ఏమి?**

గ్రహస్థితి బాగులేనపుడు రోజులు బాగులేవని వాపోవుట సహజం, విధి మనకు వ్రాసిపెట్టిన విధంగా జరుగుతుందిగాని మనమకొన్నట్లు జరుగదుకదా! దీనినే గ్రహపాటు లేక గ్రహచారం అని అందురు.

**79. గ్రహయుద్ధ మనగా ఏమి ?**

బుధ, గురు, శుక్ర, శనులలో ఎవరైనా చేరుటవల్ల గ్రహయుద్ధ మేర్పడును.

**80. అయనాంశ అనగా ఏమి?**

సాయన నిరయన రాసులకు గల భేదము.

**81. గ్రహ రుచుల నెఱిగింపుము ?**

రవికి కారం, చంద్రునకు లవణం, కుజుడు చేదు బుధునకు షడ్రసములు, గురునకు తీపి, శుక్రునకు పులుపు, శనికి వగరు రుచికరమయినవి.

గ్రహములకు ఉచ్చరాశులు :– సూర్యునకు మేషం, చంద్రునకు వృషభం, కుజునకు మకరం, బుధునకు కన్య గురునకు కర్కాటకం, శుక్రునికి మీనం, శనికి తుల, రాహువునకు వృషభం, కేతువునకు వృశ్చికం.

**82. గ్రహ రత్నములేవి ?**

రవికి మాణిక్యం, చంద్రునకు ముత్యము, కుజునికి పగడం, బుధునికి మరకతం, గురువునికి, పుష్యరాగం శుక్రునకు వజ్రం, శనికి నీలం, రాహువునకు గోమేధికం. కేతువునకు వైఢూర్యం ప్రీతికరములు.

మరియు రవికి తామ్రము, చంద్రునకు మణులు కుజునికి బంగారం, బుధునకు ఇత్తడి కంచు, గురువుకు వెండి బంగారము, శుక్రునికి ముత్యములు, శనికి ఇనుము, రాహువుకి సీసం కేతువుకి నీలం, ఈ విధమయిన లోహములు ప్రధానములైనవి.

**83. గ్రహములయొక్క కారకత్వములను తెలుపుము ?**

రవి పితృకారకుడు. చంద్రుడు మాతృకారకుడు, కుజుడు సోదరకారకుడు, బుధుడు వ్యాపార, సంపదలకు గురు విద్యాపుత్రులకు, శుక్రుడు, కళత్రయమునకు, శని ఆయుర్దాయమునకు కారకులు.

ఈ గ్రహములకు స్వక్షేత్రములు రవికి సింహం, చంద్రునకు వృషభం, కుజునకు మేషం, బుధునకు కన్య, గురునకు ధనుస్సు, శుక్రునకు తుల, శనికి కుంభం, రాహువునకి సింహం. కేతువునకు కుంభం.

**84. ఏ గ్రహ మెట్టిది ?**

రవి స్థిరగ్రహం, చంద్రుడు చరగ్రహం, కుజుడు ఉగ్రగ్రహం. బుధుడు, మిత్ర, గురుడు మృదు, శుక్రుడు లఘు, శని తీవ్రగ్రహం.

అక్షమనగా నేమి?

జ్యోతిచక్రంయొక్క అక్షదంతం, దక్షిణోత్తర ధృవముల యొక్క మధ్యప్రదేశం.

**85. “జాతకర్మ” అనగా ఏమి?**

బిడ్డ పుట్టినప్పుడు బిడ్డకు తండ్రి చేయవలసిన సంస్కార విశేషం పూర్వులు దీనిని శిశువు పుట్టిన వెనువెంటనే జరిగించెడివారు. నేటి జనులు 11-12-21-29-31 దినముల యందు జరిగించుచున్నారు. దీనినే బారసాల అను పేరుతో పిల్చుచున్నారు.

బిడ్డపుట్టిన నక్షత్రముయొక్క చెడునుబట్టి తండ్రి పిల్లవాని ముఖమును నూనెలో తొలుత చూసి ఆపై దానములు, శాంతులు పూర్తిచేసుకొనవలసి యున్నది.

**86. రాశి చక్రం చేయు విధమెట్టిది ?**

సిద్ధాంత పంచాంగములతో ఇవి ప్రతినెల ప్రారంభంలోను వేయబడి ఉంటాయి. గ్రహములు ఒక రాశి నుండి మరో రాశిలోనికి మారునపుడు అది గమనించి చక్రములో ఆ ప్రభావము సదరు గ్రహమును గుర్తించవలెను. ఈ చక్రములో 12 గడులుండును. 9 గ్రహములను వాటి స్థితినిబట్టి ఆ చక్రంలలో స్థిరపరచినచో జాతకుని జీవిత ఫలములు తెలియగలవు. ఉత్తరాంధ్ర ప్రాంతములలో ఆపసవ్య చక్రములు దక్షినాదివారు

సవ్య చక్రములను వాడుదురు. సవ్యచక్రములో గ్రహాలు ఎడమ భాగం నుండి కుడివైపుగ వేయుదురు. చక్రములు వేయుటలో తేడాలు ఉన్నను ఫలితములు మామూలుగానే అందరికీ గణితములోనికి వచ్చును.

## 87. దశాశేషం కనుగొనుటెట్లు ?

జననకాల దశాశేషం కట్టుటకు జన్మనక్షత్ర ప్రమాణం కనుగొనవలెను. నక్షత్ర ప్రమాణములు సర్వ సమానంగా ఉండవు. హెచ్చుతగ్గులుండును. దిన ప్రమాణముకంటె సుమారుగా 7 ఘడియల కాలం (2గం॥ 48ని॥లు) వరకు హెచ్చుటగాని, తగ్గుట గాని సంభవించును. ఉదా:- కృత్తిక 26 గం. 32 ని॥లు. అనూరాధ 21 గం. 12 ని॥లు నక్షత్ర ప్రమాణం తెలిసికొనుటకు గడచిన నక్షత్రములయొక్క అంత్యం, ప్రస్తుత నక్షత్ర అంత్యముకన్న ఎంత హెచ్చుగ ఉన్నదీ లేక ఎంత తక్కువైనదీ లెక్కించి తేడాను ఎక్కువయిన సమయమును దిన ప్రమాణమునకు (అనగా 24 గంటలకు) కలుపవలెను. తేడా తక్కువయిన దినములలో 24 గంటల కాలములో తీసి వేయవలెను. ఇట్లు లభించిన సమయమే ఋక్షాద్యంతం లేక నక్షత్ర ప్రమాణం, పంచాంగములందు నాద్యంత్యములు ఘడియలలోను ఇవ్వబడును.

జనన సమయమునకు నక్షత్రము కొంత జరిగియుండవచ్చును. దీనినే నక్షత్రభుక్తి అందురు. దీనిని నక్షత్ర ప్రమాణములో నుండి తీసివేయగా నక్షత్రశేషం, లేక ఏష్యము వచ్చును.

## 88. అంతర్దశను తెలిసికొనుటెట్లు ?

మహాదశానాథుని దశా సంవత్సర సంఖ్యచే అంతర్దశానాథుని మహాదశా సంవత్సర సంఖ్యను గుణించవలెను. అట్లు గుణించగా వచ్చు సంఖ్య మూడు స్థానములకంటె మించివుండరాదు. ఆ సంఖ్య యందలి మొదటి అంకెలు నెల అగును. 4వ సంఖ్యను మూడుచేత గుణించగావచ్చు సంఖ్య దినములుగను గ్రహించవలెను.

ఉదా :- రవిదశలో గుర్వంతరం ప్రమాణ మెంత ?

మహాదశానాథుని దశా సం॥ర సంఖ్య-6 అంతర్దశానాథుని మహాదశా దశా సం॥ర సంఖ్య-16, అంతర్దశానాథుని మహాదశా సం॥ర సంఖ్య $16\times6=96$. ఇందు మొదటి అంకె 9. ఇవి నెలలు, చివర సంఖ్య=6, దానిని 3చేత గుణించగా వచ్చు సంఖ్య$6\times3=18$ దినములు. అనగా రవి మహాదశలో గుర్వంతర ప్రమాణము 0 సం॥ 9 మా॥ 18 రోజులు.

**89. విదశను కనుగొనుట ఎట్లు ?**

అంతర్దశా కాలమును దినములలోనికి మార్చవలెను. దానిని మహాదశా సంవత్సరములచేత హెచ్చించింది. 120 చేత భాగింపగా వచ్చిన లబ్ధం విదశగా ఎఱుంగవలెను.

రవి దశలో రవ్యంతరంలో చంద్ర విదశ చంద్రుని అంతర్దశాకాలం 6నెలలు దీనిని దినములలోనికి మార్చగా 6×30=180 రోజులు. ఈ వచ్చిన సంఖ్యను మహాదశా కాలమైన 6చే గుణించగా 180×6=1080 వచ్చింది. దీనిని 120 చేత భాగించగా 1080÷120=9 లబ్దముగాన రవ్యంతరములో చంద్రవిదశ 9 రోజులగును.

**90. నక్షత్రముల కేర్పడు దశలేవి?**

| | | | |
|---|---|---|---|
| కృత్తిక | ఉత్తర | ఉషా | రవి దశ 6 సంవత్సరములు |
| రోహిణి | హస్త | శ్రవణం | చంద్ర దశ 10 సంవత్సరములు |
| మృగ | చిత్త | ధనిష్ఠ | కుజ దశ 7 సంవత్సరములు |
| ఆర్ద్ర | స్వాతి | శత | రాహు దశ 18 సంవత్సరములు |
| పున | విశాఖ | పూ॥భా | గురు దశ 16 సంవత్సరములు |
| ఆశ్లేష | జ్యేష్ట | రేవతి | బుధ దశ 17 సంవత్సరములు |
| మఖ | మూల | అశ్విని | కేతు దశ 7 సంవత్సరములు |
| పుబ్బ | పూ॥షా | భరణి | శుక్ర దశ 20 సంవత్సరములు |

**91. జన్మలగ్న నిర్ణయ మెటింగింపుము ?**

నేటి సూర్యోదయం నుండి మరునాటి సూర్యోదయం వరకు ఒక సౌరదినం. ఈ దిన ప్రమాణములో మేషాది ద్వాదశ లగ్నములు సూర్యసంక్రమణం ననుసరించి సూర్యోదయం నుండి ప్రారంభమగును. రోజుకి 8-11 విఘడియలు చొప్పున సూర్యోదయానికి గడచిపోయి లగ్నభుక్తి జరుగును. పంచాంగములో యీ లగ్నభుక్తిని చూపు చుందురు. దీనిని బట్టి జనన సమయమునకు సరియైన లగ్నం లెక్కించుకొన వచ్చును. ఉదయలగ్న శేషమునకు మిగిలిన రాశి ప్రమాణములు కలిపి జనన సమయమున ఏరాశియందు సంభవించునో అదియే జన్మలగ్నమగును.

**92. గ్రహమనగా నేమి ?**

పట్టుకొనునది, పీడించునది ముఖ్యమైనవి 9 గ్రహములు, రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహువు, కేతువులు.

**93. పంచాంగములో ఏముండును ?**

పంచాంగముల ముఖ్యంగా అయిదు అంగములకు సంబంధించిన ముఖ్య విషయములుండును. 1. తిథి 2. వారం 3. నక్షత్రం 4. యోగం 5. కరణం అంతేకాక

సూర్యోదయ సూర్యాస్తమయ వేళలు గ్రహ ప్రవేశములు, తిథి నిర్ణయములు పర్వదిన విశేషములు వీనిని గూర్చిన వివరణలు ఉండును.

**94. కొంతమంది జ్యోతిశ్శాస్త్రజ్ఞుల పేర్లను తెలుపుము ?**

ప్రహ్లాదుడు, గర్గి, సనత్కుమారుడు నారదుడు, కాళిదాసు, భృగువు, పరాశరుడు, జైమిని, యవనాచార్యుడు వరాహమిహిరుడు. విశ్వకర్మ

**95. కొన్ని జ్యోతిష గ్రంథములపేర్లు వ్రాయుము ?**

కాలామృతం, సారావళి పారాశరి, దశాభుక్తి, ఫలచంద్రిక, జైమినీ సూత్రములు, ముహూర్త రత్నావళి, జలార్గళశాస్త్రం. జాతక చంద్రిక, దైవజ్ఞ, కర్ణామృతం, జ్యోతిష ఫలప్రదర్శిని, వాస్తుదుందుభి, జ్యోతిషమర్మబోధిని, జాతక సరస్వతి జ్యోతిర్మణిమాల, కాలసాధన, కౌముది.

**96. డిగ్రీ అనగా ఏమి ?**

"భ" చక్రమును విభజించిరి. రాసుల ప్రమాణ మెరుగుటకై ఏర్పరచుకొన్న సంకేతం భ చక్ర పరిమాణం 360 డిగ్రీలు. ఒక్కొక్కరాశి ప్రమాణం 30 డిగ్రీలు, నక్షత్ర పాదములు 9 కలసి ఒక రాశి యగును.

**97. "భ" చక్రం అనగా ఏమి ?**

గ్రహాలు, నక్షత్రములు చరించు మార్గం :- కొన్ని నక్షత్రాది గోళములు ఆకర్షణ శక్తిచే క్రమబద్ధమై భూమి మీద నిల్చి యున్నది.

**98. భూవలయ మనగా ఏమి ?**

భూమి దీనిని ఊహాకు 160 డిగ్రీలుగా విభజించి యున్నారు. దీని అడ్డు కొలత 1,28,000 మైళ్ళు చుట్టుకొలత 40,772 మైళ్ళు.

**99. శింశుమార చక్రమనగా ఏమి ?**

ఆకాశమును 12 భాగములుగా 12 రాసులు తిరుగుటకై విభజించుకొన్నది. రవ్యాది సప్త గ్రహములు, నక్షత్రములు ఇందు తిరుగుచుండును. నక్షత్రములు తూర్పున ఉదయమై పశ్చిమము అస్తమించును.

**100. జన్మకుండలి అనగా ఏమి?**

జాతకచక్రం వేయునపుడు ఆయా రాసులలో వేయవలసిన చోట్ల ఆయా గ్రహములను గుర్తించుటవల్ల ఏర్పడుచక్రం, ఇది జాతకుడు పుట్టినప్పటి గ్రహముల స్థితిని లగ్న విశేషమును తెలియజేయును.

**101. లగ్న షడ్వర్గులేవి?**

లగ్నం, హోరా, ద్రేక్కోణం, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశ.

**102. ఆదివారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?**

ఇందు జన్మించినవారు ఛామనచాయ శరీరము గలిగియుందురు. పైత్య తత్త్వమును చురుకుదదనము స్వయంకృషి కలిగి జీవింతురు. ఇతరుల మనస్సులను యిట్టే గ్రహించగలరు. సువర్ణాభరములు ధరించుట వీరికి ప్రీతి. ఏ పనినైనా వీరు చాల తొందగా పూర్తిచేయుదురు.

**103. సోమవారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?**

ఇందు పుట్టినవారు అందమైన రూపముతో అలరారుచుందురు. సత్వగుణము ప్రధానమైనవారు. విశేష శాస్త్ర కృషి గావింతురు. నిర్మలమైన మనస్సు గలిగి పరోప కారబుద్ధి గలిగి జీవింతురు. ఆరోగ్య పరిరక్షణ వీరికి యిష్టమైనపని. నీటివద్ద వీరు భయపడుచుందురు.

**104. మంగళవారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?**

ఇందు జన్మించినవారు నీరువుతో కూడిన శరీరఛాయగల వారును, ఆలస్యముగా విద్యను అభ్యసించువారును, తామస ప్రవృత్తితో సంచరించువారును, తరచుగా అనారోగ్యములకు గురియగువారును కాగలరు.

**105. బుధవారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?**

ఇందు పుట్టినవారు చామనఛాయతో వెలయు శరీరముగల వారును, సౌమ్యమైన మాటలను పలుకువారును, సూక్ష్మగ్రాహులును, వ్యవహార జ్ఞానము గలవారును, వృత్తీ ఉద్యోగములలో రాణించువారును, సభలయందు మొగమాటము లేకుండా ఉపన్యసించువారును కాగలరు.

**106. గురువారం జన్మించినవారి లక్షణాలు ఏమిటి?**

ఇందు జన్మించినవారు మధ్యమ దేహమును సుందర వదనము గలవారై ధైర్యవంతులై ప్రవర్తించెదరు. ఇతరులకు తమ ప్రజ్ఞచూపి మెప్పుపొందుదురు. అనేక విషములందును, ఆరితేరినవారై అనుమాన మెఱుగక మెలగుచుందురు.

**107. శుక్రవారము జన్మించినవారి లక్షణాలు ఏమిటి?**

ఇందు పుట్టినవారు తేజోవంతులును రజోగుణ ప్రధానులు అయి విచ్చలవిడిగా సంచరింతురు. సర్వశాస్త్రకోవిదులుగా ప్రఖ్యాతులు కాగలరు. స్వల్ప విషయాలకే నొచ్చు

కొందురు. కొందరు కార్యాలయ ప్రధానులుగా పనిచేయుదురు. వంశోద్ధారకులై పొగడ్తలొందుదురు.

**108. శనివారంము జన్మించినవారి లక్షణాలు ఏమిటి?**

ఇందు జన్మించినవారు నల్లని దేహముకలిగి మందమతులై సంచరించెదరు. తామసప్రవృత్తిలో మునిగియుందురు. పొట్టికాళ్ళు వెడల్పు పాదములు కలిగి ఆలస్యముగా నడచుచుందురు. భాగ్యవంతులగుటకై ఎన్నో ప్రయత్నములు జరుపుచుందురు.

**109. పగలు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

పగటిపూట పుట్టిన మానవులు తెలివితేటలు గలవారును దూరదృష్టితో సంచరించు వారును సునాయాసముగా సర్వకార్యములు ఆచరించువారును, కాగలరు. ఆరోగ్యవంతులగుదురు.

**110. సంధ్యాకాలం జన్మించినవారి లక్షణాలు ఏవి?**

సంధ్యాకాలమందు పుట్టిన జాతకులు ఇతరుల సహాయం లేనిదే ఏ పనులను చేయలేనివారును పెద్దలు చెప్పినవి లక్ష్యపెట్టనివారును నాస్తిక వాదప్రియులు కాగలరు.

**111. రాత్రి జన్మించినవారి లక్షణాలు ఏవి?**

రాత్రికాలమందు జన్మించినవారు కృశించిన శరీరము గలవారును, దృష్టిమాంద్యమునకు గురియైన వారును నిలకడ లేని మనస్సుతో సగములో పనిని విడిచి పెట్టువారును కాగలరు.

**112. పాడ్యమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

వీరికి మతిమరపు జాస్తి. చిక్కులలో ఇరుక్కుందురు. దూరాలోచన తక్కువ. సామాన్యమయిన ధనమును కలిగి సంతృప్తితో జీవింతురు.

**113. విదియ తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

దైవభక్తి కలిగి తమ ధర్మములను నెరవేర్చు చుందురు. పేరాసకుపోక ఉన్నంతలో సుఖజీవనం చేయుచుందురు.

**114. తదియ తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

దేవునిపై భారముపెట్టి పనులు ప్రారంభింతురు. కర్మ సిద్ధాంతముపై ఆధారపడతారు. లోటులేని జీవనమును సాగించుచుందురు.

**115. చవితి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఇతరులు చెప్పినది నమ్మరు. స్వానుభవము కావలసినదే. గురువుకు పాఠములు నేర్పెదురు. మౌనముతో కార్యములను సాధించుకొందురు.

**116. పంచమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

తాము బాగుపడి ఇతరుల బాగు కోరుచుందురు. లోక శ్రేయస్సుకై పాటుపడుదురు. జీవహింస చేయుటకై వెనుకాడరు. ఆరోగ్యవంతులు.

**117. షష్టి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

వాగ్ధానములను నెరవేర్తురు. ఎక్కువమందిని తమ వెనుక త్రిప్పుకొందురు. ఎల్లప్పుడు తీరికలేని పనులతో సతమతమగుచుందురు.

**118. సప్తమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

సున్నితమైన మనస్సుతో శ్రేయోదాయకమయిన భావాలతో కాలవములతో చేయుదురు. దాపరికం లేక దానధర్మములను ఆచరించెదరు.

**119. అష్టమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కఠినమైన మాటలు, చేతలు కలిగి యుందురు. కృతఘ్నుతాభావము జాస్తి. బంధు మిత్రులను దూరమందుంచెదరు. శక్తికి మించిన పనులు చేయుదురు.

**120. నవమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

తక్కువ ఆహారము తిందురు. ప్రయాణములు ఖర్చు చేయుదరు. ఇతరులపై ఖర్చులు రుద్దుదురు చెప్పినదొకటి, చేసేది యింకొకటి.

**121. దశమి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కుటుంబమునందు ప్రీతి గలవారు. పొగడ్తలకు పొంగిపోవుదురు. దీర్ఘరోగములచే బాధపడుదురు. అలక్ష్యభావ మధికము.

**122. ఏకాదశి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఆచరములను పాటింతురు. శాస్త్రకృషిలో నిష్ణాతులు, భగవంతునిపై భారము విడిచి కర్మ లొనరించెదరు. అల్ప సంతోషులు.

**123. ద్వాదశి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కష్టసుఖములు సమానముగా అనుభవించుచుందురు. దేనికిని భయపడరు. లాభమో, నష్టమో తనకు నచ్చినటులే అన్నింటా వ్యవహరించుదురు.

**124. త్రయోదశి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

చదువునందాసక్తి గలవాడు, ఇతరులకింత పెట్టి తానింత అనుభవించువాడును ఎల్లప్పుడు సంతోషముతో కూడుకొని యున్నవాడును కాగలడు.

**125. చతుర్దశి తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఇతరులను నమ్మినవాడును, ధనమును పొదుపుగా ఖర్చు చేయువాడును, దైవ గురుభక్తి గలవాడును, ఆరోగ్యవంతుడును కాగలడు.

**126. పూర్ణిమ తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

దేహారోగ్యము కలిగి ఉపావాసాది కార్యక్రమాలు నిర్వహించువాడును, ధనమును విరివిగా ఖర్చు చేయువాడును, నిత్యసంతుష్టి కలవాడగును.

**127. అమావాస్య తిథినాడు జన్మించినవారి లక్షణాలు ఏవి?**

తలపెట్టిన పనులయందు మనస్సు నిల్పువాడును అనారోగ్యములను లెక్క చేయనివాడును స్వార్థము ఎక్కువగా గలవాడును కాగలడు.

**128. శుక్లపక్షం జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

పవిత్రమైన నడవడిక, సత్యవాక్పరిపాలనము విద్యయందు రాణించువాడును, ధనసంపాదనం గలవాడును కాగలడు.

**129. బహుళపక్షం జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కమలిన శరీరము, విద్యయందు అశ్రద్ధ బాల్యం నుండి కొన్ని అలవాట్లకు లోనగుట అనవసర వ్యవహారములలో తలదూర్చుట వీరికిష్టము.

**130. వసంత ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?**

ఇందు పుట్టినవారు శత్రువులను జయించుశక్తి గలవారును, విశేష జ్ఞాపకశక్తి గలవారును, ఎల్లప్పుడు ధనముతో తులతూగువారును అగుదురు.

**131. గ్రీష్మ ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?**

కల్లకపటము లేనివారును పెరాసపొందు వారును కొద్దిపనులు చేసి అలసట పొందువారును, ఆస్థిని తరగించువారును అగుదురు.

**132. వర్ష ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?**

కృష్టియందిష్టము చూపువారును, కష్టనష్టములకు ఓర్చుకొనువారును కాగలరు.

**133. శరదృతువులో జన్మించిన లక్షణాలు ఏవి?**

అనారోగ్యవంతులును, సుఖజీవనము చేయుటయందు ఆసక్తి గలవారును, విద్వాంసులును, సభలలో గౌరవమును పొందువారును అగుదురు.

**134. హేమంత ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?**

విద్యాసక్తులు, సుజనప్రియులు, ధనవంతులు ఆడుతూపాడుచు పనిచేయువారు అగుదురు.

**135. శిశిర ఋతువులో జన్మించిన లక్షణాలు ఏవి?**

అనారోగ్యము గలవారు, డబ్బుకై యిబ్బంది పడువారు మోసబుద్ధిని చూపువారును అగుదురు.

**136. ఉత్తరాయణంలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ఇందు పుట్టినవారు విజ్ఞానవంతులు, సత్యవాదులు, అన్వేషణాపరులు, ధర్మ కార్యములు చేయువారును సుఖవంతులు కాగలరు.

**137. దక్షిణాయనములో జన్మించిన లక్షణాలు ఏవి?**

వీరు విద్యయందు అశ్రద్ధ చూపుదురు. చేసిన పనికి వగచుచుందురు. నీచమైత్రికి లోనగుదురు. ఋణములు చేతురు.

**138. చైత్రమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ఆరోగ్యవంతుడై శ్రద్ధాసక్తులతో దైవపూజలు జరుపును. విద్యలయందు కైశల్యము చూపును, ఎక్కువ మందికి ఆదర్శంతుడు కాగలడు.

**139. వైశాఖమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ఇందుపుట్టినవారు సకల భోగములు అనుభవించును. స్వస్థానమున గౌరవింప బడును. మంత్రవేత్తయు, ధనికుడును కాగలడు.

**140. జ్యేష్ఠ మాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

మాతా పితరుల యెడల భక్తికలవాడును, శాస్త్ర కృషిలో నిమగ్నమై ఉండును. బహు కుబుంబీకుడును, ఆర్జనాపరుడును కాగలడు.

**141. ఆషాఢమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

స్వార్థచిత్తుడును, ఇతరులను హేళనగా చూచును లోభత్వము కలవాడును, ప్రథమ కోపమును కాగలడు.

**142. శ్రావణమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

స్థిరచిత్తము గలవాడును, ద్రవ్యమును దాచిపెట్టువాడును, కొంటెపనులు చేయు వారిని అణచిపెట్టువాడును, చమత్కార సంభాషణము గలవాడగును.

**143. భాద్రపదమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

సాధారణ విద్యాభ్యాసము చేయువాడును, అవసరమునకు యుక్తులు రానివాడును, ఊరకనే ప్రతిదానికి విచారించువాడును, అనారోగ్యవంతుడును అగును.

**144. ఆశ్వయుజమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ప్రజ్ఞాపాటవములు గలవాడును, మాయోపాయములు చూపువారిని మట్టు పెట్టు వాడును, ఉన్నత విద్య నభ్యసించి పెద్ద ఉద్యోగము చేయువాడును అగును.

**145. కార్తీకమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

మంచిబుద్ధిగలవాడును, సకలశాస్త్ర పారంగతుడును ధర్మ న్యాయము లెరిగిన వాడును, చతురత కలిగి సంచరించువాడును కాగలడు.

**146. మార్గశీర్షమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ఆదర్శప్రాయ జీవనము గలవాడును, నిధి నిక్షేపములు లాటరీలు పొందువాడును దయాదాక్షిణ్యములు కలిగి జీవయాత్ర చేయువాడును అగును.

**147. పుష్యమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

సామాన్యమైన తెలివితేటలే గలవాడైనను, జ్ఞాపకశక్తిని కలిగియుండువాడును, కృతజ్ఞత ఎరుగనివాడును అనారోగ్యవంతుడును కాగలడు.

**148. మాఘ మాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

దైవభక్తి పరుడును, ధనమును పంచిపెట్టువాడును, అభిమానవంతుడును, దుష్కృత్యములతో దూరముగా ఉండువాడును కాగలడు.

**149. ఫాల్గుణమాసములో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

మంచి ఆరోగ్యవంతుడు, కృతజ్ఞత భావముతో మెలగువాడును, ఐశ్వర్యవంతు డును పరిశోధనలు జరుపువాడును కాగలడు.

**150. మేషరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

సూక్ష్మగ్రాహులు, ధనసంపాదనాపరులు, ఉపకారబుద్ధిగలవారు, ధైర్య సాహస ములతో పట్టుదలతో కార్యసిద్ధిని పొందుదురు. అనారోగ్యమును లెక్కచేయరు.

**151. వృషభరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

ఆరోగ్యవంతులై ఎల్లప్పుడు సంతోషము కలిగియుందురు. ఉద్యోగ నిర్వహణ మందు నేర్పరులు, పనులను, వాయిదావేయక వెంటనే పూర్తిచేయుదురు.

**152. మిథునరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

ఎక్కువగా కోరికలుకలవారు, విలాస వస్తువులకై విరివిగా డబ్బు ఖర్చు చేయుదురు. ఎవరినైనను నమ్ముతారు. ఒక్కొక్కప్పుడు మోసపోవుచుందురు.

**153. కర్కాటక రాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

ఆలోచనాపరులై కార్యనిర్వహణము గావింతురు. ఆశలు హెచ్చు, నెరవేరునని స్వల్పము. పట్టుదల కృషి విడువక కార్యసిద్ధిని పడయుదురు.

**154. సింహరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

విద్యాబుద్ధులు కలిగి ఉందురు. ఉన్నతికోసం పాటుపడుదురు. వృత్తి ఉద్యోగము లలో రాణింతురు. శత్రువర్గమును ఉపేక్షించరు.

**155. కన్యరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

అమాయక ప్రవర్తన కలిగి ఉంటారు. లేమిలోపుట్టి లేమిలోనే అంతరింతురు. మధ్యలో ఔన్నత్యమును పొంది సుఖజీవనము చేయగలుగుతారు.

**156. తుల రాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

ఆరోగ్యవంతులై ఐశ్వర్యములను లెక్కించక మిత్రులకు ఉపకృశి గావింతురు. కృషించి పనులు చేయుదురు. ప్రమాదములకు గురియగుచుందురు.

**157. వృశ్చికరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

పౌరుషవంతులై ఏదో ఒక పని చేయుచునే ఉందురు. ఎవ్వరినీ ఖాతరుచేయరు. ఉన్నదానితోనే సంతృప్తిపడుదురు. నిరాడంబరజీవులు.

**158. ధనుస్సురాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

అతిజాగ్రత్తగా అన్ని విషయాలు పర్యవేక్షింతురు. తెలిసినది తక్కువైనా ఎక్కువదానికే గురి చూచెదరు. చాలామందితో గూడ సరదాగా పనిపాట్లు చేయుచుందురు.

**159. మకరరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

ఇతరుల కష్టసుఖములు ఆలోచించరు. తన పని పూర్తియైతే చాలును. చదువు సంధ్యలందు మనస్సులగ్నపరచి ఉన్నత స్థానమును పొందగలరు.

**160. కుంభరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

ఈర్ష్య అసూయలతో విద్యలు సాధిస్తారు. ధనము కొరకు పలుపాట్లు పడుచుం దురు. సంకుచిత స్వభావము కలిగి యున్నందున పెద్ద ఛాన్స్‌లు పోగొట్టుకుందురు.

**161. మీనరాశిలో జన్మించినవారి లక్షణాలు ఏవి ?**

సంగీత, సాహిత్యములనిన ప్రీతి, ధనమును గణించుటయేతప్ప, ఖర్చుపెట్టుట యెరుగరు. క్రొత్త వారితో స్నేహములు పెంచుకుందురు. ఆరోగ్యవంతులు.

**162. విష్కంభయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

సాధారణ ధనవంతులు, విచక్షణా జ్ఞానులు, చురుకుగా పనులు సాగింతురు. సుఖజీవులు.

**163. ప్రీతియోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

విద్య, వినయము కలిగియుందురు. అదృష్టముకై అఱ్ఱులు చాచుదురు. ముఖస్తుతికి యిష్టపడుదురు.

**164. ఆయుష్మాన్ యోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

ఆరోగ్యవంతులు, సుఖజీవనమార్గమున పయనింతురు. ఆరంభ సూరత్వము కలిగియుందురు.

**165. సౌభాగ్యయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

విశేషముగ చదువకున్నను పామరులవలె కనిపింతురు. అందరు మెచ్చునట్లు పనులు చేయుదురు.

**166. శోభనయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

పిరికితనము, లోభత్వము కలవారు, అనుమానములు జాస్తి, ఆకర్షణీయముగా ఉందురు.

**167. అతిగండయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

పనులయందు శ్రద్ధతక్కువ, ముందుజాగ్రత్త శూన్యము చిక్కులలో పడుచుందురు.

**168. సుకర్మయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

ధర్మకార్యములాచరించుచు పెద్దలమాట ప్రకారం నడచుకొందురు. ఆరోగ్యవంతులు.

**169. ధృతియోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

ఓర్పు, నేర్పుచూసి పనులుపూర్తి చేయుదురు.

**170. శూలయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

బలమున్నదని గర్వింతురు. ముందు వెనుకలలాలోచింపరు. కలతలు రేపుకొను చుందురు.

**171. గండయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

సామాన్య విద్యాగంధము కలవారు, గుమాస్తాలుగా రాణింతురు. తొందరపాటుతో పనులు చేయుదురు.

**172. వృద్ధియోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

ఎంతనేర్చినా యింకా తెలిసికొందురు. అల్పధనికులు, ఉపకారబుద్ధిని కలిగి జీవింతురు.

**173. ధ్రువయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

పండితులు, ప్రమాణవాక్యములు పలుకుచుందురు. ఆరోగ్యవంతులు, ధనముచే ఉన్నతులు.

**174. వ్యాఘాతయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

అల్పజ్ఞానులు, కోపవంతులు, కృషికి అలవాటుపడుదురు. పరులను నమ్మరు.

**175. హర్షణయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

కార్యములు నిర్విఘ్నముగా నెరవేర్చుకొందురు. ధనవంతులు అందరినీ సమానముగా గౌరవింతురు.

**176. వజ్రయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

ఇతరుల పనులు గిట్టవు. తామే ప్రజ్ఞాశాలురమని డంభములు పల్కుదురు. అనారోగ్యవంతులు.

**177. సిద్ధియోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

తగిన సమయంలోనే తగిన పనిని పూర్తిచేయుచుందురు. ఆశించినవిధంగా భవిష్యత్తు జరుగును.

**178. వ్యతీపాత్‌యోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

ఔన్నత్యము, నుండి దిగజారినవారును, దుష్టకార్యములు చేయుటకు జంకనివాడగును.

**179. వరీయాన్‌యోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

బాగుగా ఆలోచించి పనులు చేయువాడును, ధనమును వృధాగా ఖర్చుచేయు వాడును అగును. ముందు జాగ్రత్త వీరికి తక్కువ.

**180. పరిఘయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

అత్యాశ కలవారును, కృతఘ్నులును, మొండితనముతో వ్యవహరించువారును కాగలరు.

**181. శివయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

పరులకింతపెట్టి వగవనివాడును, పరిశుభ్రమును పాటించువాడును, ద్రవ్యవంతుడును అగును.

**182. సిద్ధయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

బుద్ధిమంతుడును, విద్యావిశేషముతో కార్యసిద్ధిని పొందువాడును, మిత్రులతో ఆనందముగా గడుపువాడగును.

**183. పాధ్యయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

ధనమును గడించుకొనువాడును, ధర్మమెరిగినవాడును, పెద్ద ఉద్యోగము చేయువారగుదురు.

**184. శుభయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

స్వల్పముగా మాట్లాడుదురు. మొగమాటము హెచ్చు. పరిశుద్ధ జీవనము చేయుదురు.

**185. సుభ్రయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

అందరితో కలసి ఆనందముగా జీవింతురు. దూరప్రాంతములలో నివసించుటకు ఇష్టపడుదురు. అనుకున్న పనులు సాధించుకొందురు.

**186. బ్రాహ్మయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

సుఖాభిలాషులు, సకల కార్యదక్షులు, ఉన్నతస్థానములనుకరించి కీర్తి గడింతురు.

**187. ఐంద్రయోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

స్వల్పధనం, తీరికలేని పనులు ఉన్నతపదవులలో గలవారితో పరిచయ భాగ్యం గలవారగుదురు. అవలీలగా పనులు ముగించుకొందురు.

**188. వైధృతియోగ జన్మించిన లక్షణాలు ఏవి?**

అనారోగ్యము, అసంతృప్తి, ఎవరితోను పడకపోవుట, వ్యసనాశక్తి కలవారగుదురు.

**189. బవకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఉదారబుద్ధి కలవారు, దానధర్మములు చేయువారును తొందరగా పనులు ముగించువారును కాగలరు.

**190. బాలవకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ధైర్యసాహసములు గలవారును శీలవంతులును పరోపకార పరాయణులును కాగలరు.

**191. కౌలవకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

తనసంతోషము తన సౌఖ్యములను కోరుకొనువారును, అసహనశీలురును, పరుల వంచించువారును కాగలరు.

**192. తైతులకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

తామాచరించక ఇతరులకు మంచిచెడ్డలు గూర్చి చెప్పువారును, ధనమును దుర్వినియోగపరచువారగుదురు.

**193. గరజికరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కొన్నిమంచి పనులనుచేసి పెద్దలను మెప్పించువారును, రహస్య కార్యములను ఆచరించువారును కాగలరు.

**194. వణజికరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

వ్యవహార జ్ఞానము గలవారును, ధనసంపాదనాపరులును, డాంబికములు పల్కువారును అగుదురు.

**195. విష్టికరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఇతరుల లోపములను ఎన్నువారును చెడుసహవాసములకు లోనగుదురు. చంచల చిత్తులును అగుదురు.

**196. శకునికరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

విద్యాబుద్ధులు తక్కువగా కలవారును, ఇతరులను మోసగించు బుద్ధిగలవారును కాగలరు.

**197. చతుష్పాత్‌కరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

అధభిమానవంతులును వర్తక వ్యాపారములందు నేర్పుగలవారును, ధనము దాచువారు అగుదురు.

**198. నాగవకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

బుద్ధిమంతులును, వైద్యశాస్త్ర మెరిగినవారును పరహితమును కోరువారును కాగలరు.

**199. కింస్తుఘ్నకరణ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఆత్మలో ఒకటిపెట్టుకొని బయటికి ఇంకొకటి చెప్పుదురు. జిత్తులు వేయుచుం దురు.

**200. అశ్వయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ముక్కుకి సూటిగా పోవు స్వభావము కలవారు కార్య నిర్వహణాదక్షులుగా పేరు సంపాదించుకొందురు.

**201. గజయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కుశలబుద్ధి, ఆరోగ్యము, ఐశ్వర్యము కలిగి కుటుంబ ప్రీతిగలిగి జీవితము కొనసాగింతురు.

**202. అశ్వయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

విద్యాభిలాష తక్కువ. భోజనప్రియులు, ఇతరులతో జగడములు పెట్టుకొందురు.

**203. సర్పయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

వినయము వివేకము లేని విద్య కలిగియుందురు. స్వలాభాపేక్ష, పరుల కపకారములు చేయుదురు.

**204. శ్వాసయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కపటప్రేమనటింతురు. ఆడితప్పుటకు జంకరు, వ్యవహారజ్ఞానమును కలిగి యుందురు.

**205. మార్జాలయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

సుఖాన్వేషులు, ధనమున్నను ఖర్చు చేయుదురు. నమ్మినవారిని మోసగించుటకు వెరవరు.

**206. మూషకయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

పాటుపడి పనిచేయుదురు. తప్పులు కప్పిపుచ్చుదురు. యజమానికి హాని చేయుదరు.

**207. పశుయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

పెద్దలమాట పెడచెవిని పెట్టుదురు. తమ ఆలోచన ఎట్లున్న అట్లే పనులాచరించుచుందురు.

**208. మహిషియోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కార్యశూరులు, సంపూర్ణ ప్రజ్ఞ గలవారు, ధనమును గడించుటలో ఆశక్తిని చూపును.

**209. వ్యాఘ్రయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఆలోచనాశక్తి, అవగాహనజాస్తి గలవాడు, వృత్త వ్యాపారాలు బాగా నిర్వహించును.

**210. మృగయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

దైవభక్తి, పరోపకారబుద్ధి గలవాడు, వారి విధిని మరచిపోక సకాలంతో పూర్తిగా చేస్తారు.

**211. కపియోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

చంచలబుద్ధితో సకలము పాడుచేసుకొనును. కార్యాచరణములో విశ్రాంతి లేక పూర్తిగావింతురు.

**212. నకుల యోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

మైత్రిభావము, అల్పసంతోషము, ధర్మ జీవనము గావించుట వీరికి ఇష్టమైనవి.

**213. సింహయోని జన్మించినవారి లక్షణాలు ఏవి?**

విద్యావంతులు, హోదాగలవారు, జంకు బొంకు లేక వ్యవహారములు పూర్తిగావింతురు.

**214. దేవగణ నక్షత్రాలలో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, రేవతి. ఇందు పేర్కొన్న 9 నక్షత్రాలు దేవగణమునకు సంబంధించినవి. ఇందు జన్మించిన వారు దైవభక్తి గలవారు. మాతా పితృసేవాపరాయణులు. అనేక పుణ్యకార్యములు గావింతురు. ధర్మమార్గమును తప్పక సంచరింతురు.

**215. మనుష్యగణ నక్షత్రాలలో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

భరణి, రోహిణి, ఆర్ద్ర, పుబ్బ, ఉత్తర, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, పూర్వభాద్ర, ఉత్తరాభాద్ర. ఇందు పుట్టినవారు పరోపకార పరాయణులు, శౌచదయాసంపన్నులు, దానములు, వ్రతములు చేయుటయందు అనురక్తి గలిగి ఉండును. దేవునిమీద నమ్మకము గలవారగును.

**216. రాక్షసగణ నక్షత్రాలలో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కృత్తిక, ఆశ్లేష, మఖ, చిత్త, విఖాశ, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం, పై 9 తారలలో పుట్టినవారు అధర్మ కృత్యములు జరుపుటకు జంకరు. స్వార్థపరులు నాస్తిక వాదమున ప్రవీణులు, దైవమిచ్చిన సిరిసంపదలను నిల్పుకోజాలరు.

**217. మేషలగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

రూపవంతులు, విద్యానిపుణులు, వినయము గలవారు, కార్యసిద్ధిని పొందువాడును అగుదురు. కుటుంబమందు యిష్టము చూపువారగుదురు.

**218. వృషభ లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఆరోగ్యము, ఆనందము కలిగి జీవింతురు. భోజనప్రియులు, కార్యశూరులు, శ్రమకోర్చి పనులు నెరవేర్చువారును కాగలరు.

**219. మిథున లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

పట్టనపట్టు విడువక పూర్తిగావించుచుందురు. అన్ని వేళలా మిత్రులకు సహకరింతురు. నూతన పరిశోధనలను చేయుచుందురు.

**220. కర్కాటక లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

విద్యతోపాటు వివేకము కలిగియుందురు. పెద్దలందు గౌరవము చూపుదురు. అనారోగ్యముతో పోరాడుచుందురు. అసహనశీలురు.

**221. సింహ లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

కష్టసాధ్యమైన పనులను కూడా అవలీలగా పూర్తిచేయుదురు. తలకుమించిన పనులను ప్రారంభింతురు. అన్నింటా తమదే జయమని భావించుదురు.

**222. కన్య లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

నేర్చుకొన్న విద్యలు మరచిపోరు. చాలాకాలం జ్ఞాపకముంచుకొందురు. ఆరోగ్యం, ఐశ్వర్యం కలిగి ఉందురు. దేశభక్తి ప్రజాసేవలు వీరికి హితవు.

**223. తుల లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

మంచి చెడ్డలను పూర్తిగా తెలిసికొని తమకు తోచిన విధంగా సంచరింతురు. పరోపకాబుద్ధితో అందరితో మైత్రి కలిగి యుందురు.

**224. ధనుస్సు లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

స్వతశ్శక్తితోపైకి వచ్చెదరు. శాస్త్రకృషితోనే జీవితాంతము కాలము గడుపుచుందురు. కులంనందు ప్రధానులు కాగలరు. ఆరోగ్యవంతులు.

**225. మకర లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

లోభము ఖర్చు ఎక్కువ తమపనులు పూర్తియైన చాలునని భావింతురు. తమకు కేటాయించిన పనులలో నిర్లక్ష్యము చూపుచుందురు.

**226. కుంభ లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

వీరు సామాన్య ధనవంతులు, కుటుంబ పోషకులు కాలమును సద్వినియోగ పరచుకొను వారగుదురు. ఎంతటి కష్ట నష్టములు వచ్చిననూ తొణకరు-బెణకరు.

**227. మీన లగ్నములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

సౌఖ్యవంతులు, గుణవంతులు, సంగీత సాహిత్యములందు ఆసక్తి గలవారు, సంగీత సాహిత్యములందు ప్రావీణ్యత గలవారు కాగలరు.

**228. అశ్వని నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు విజ్ఞానవంతులు, విభవోపేతులు ఆయుష్మంతులు, సభాగౌరవమును పొందువారు కాగలరు. బాల్యములో గండములు 10వ సం॥ నుండి 20 సం॥ వరకు విద్యాభివృద్ధి 20-30 ఉద్యోగం 30-40 రాజకీయలబ్ధి 40-60 ప్రశాంత జీవనం ఆపై ఏవరేజ్‌గా ఉండగలదు.

**229. భరణి నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు చపలచిత్తులు, సుఖాభిలాషులు, భోజన ప్రియులు నిద్రాశక్తులు కాగలరు. పుట్టిన తొలి సం॥నుండి 10సం॥వరకు ఆరోగ్యం, విద్యాభివృద్ధి, 10-20 పరీక్షలలో ఉత్తీర్ణత, 20-30 ఉద్యోగప్రాప్తి వివాహం. పుత్రలాభం 30-50 సుఖ కుటుంబ జీవనం. 50-60 సామాన్య జీవనం, ఆపై జీవితాంతం శుభపాప మిశ్రమ ఫలం పొందగలుగుతారు.

**230. కృత్తిక నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు పరిశుద్ధ మనస్కులు, కళాకారులు, విజ్ఞాన వంతులు, అన్ని సమస్యలను స్వయముగా చక్క పెట్టుకోగలవారు కాగలరు. 1-5 సం॥ వయస్సు మధ్యలో స్వల్ప ప్రమాదములకు గురికాగలరు. 61-16 విద్యాభివృద్ధి జరుగును. 17-23 విద్యకు ఆటంకములు వచ్చును. 24-40 ఉద్యోగప్రాప్తి వివాహము దూర ప్రదేశ, ప్రయాణములు 41-56 కుటుంబ వృద్ధి గృహనిర్మాణము వృత్తిలో లాభం 57 నుండి జీవితాంతం సామాన్య ఫలితాలలో కాలము గడచును.

**231. రోహిణి నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు కార్యదీక్ష, పట్టుదలగవారు, స్వయంకృషితో ప్రకాశించగలరు. రూప లావణ్యములు గలవారు, సుఖవంతులు కాగలరు. 1-10 సం॥ మధ్యకాలములో అల్లారు ముద్దుగా పెరుగుదురు. 11-19 సం॥ మధ్య విద్యాభంగములు 19-26 వృత్తి ఉద్యోగాలలో ప్రవేశము, 27-52 సుఖ సంసారం ధనలాభం. 52-63 సామాన్య జీవనము, ఆపై జీవితాంతం వరకు తిరిగి అభివృద్ధి పొందగలరు.

**232. మృగశిర నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు మధ్యమదేహులు, కోపస్వభావులు, ద్రవ్యపరులు కార్యసిద్ధిని పొందుదురు. ఉదార చరితులు కాగలరు. 1-6 మధ్యకాలము చిన్న చిన్న గండములతో

గడచును. 7–25 మధ్య విద్యాభివృద్ధి వృత్తిశిక్షణ తండ్రికి లభించుట, 26–45 నూతన ఉద్యోగప్రాప్తి, వివాహము, 46–65 ధనసంపాదనము, వస్తు వాహనప్రాప్తి, వివాహము, 46–65 ధనసంపాదనము,వస్తు వాహనప్రాప్తి, ఆపై జీవితాంతము ఏవరేజ్ ఫలితాలతో గడచును.

**233. ఆర్ద్ర నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు సాహసం, ధైర్యము గలవారు, చేసినపని మంచిదైనా చెడుదైనా విచారించరు. వ్యాపార నైపుణ్యం గలవారు కాగలరు. బలిష్టమైన శరీరము కలిగి రాణింతురు. 1–10 మధ్య వయస్సున స్థానచలనము, ఉదర సంబంధమైన అనారోగ్య ములు. 10–20 విద్యాభివృద్ధి శిక్షణాకార్యక్రమములు 21–36 నూతన వృత్తులలో ప్రవేశము, వివాహం, సుఖజీవనం, 37–56 సామాన్య జీవితాంతము వరకు సంతోష జీవితం గడచును.

**234. పునర్వసు నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈజాతకులు 1–10 మధ్యగల వయస్సులో సుఖంగా పెరుగుదురు. 11–20 చదువు సంధ్యలు పూర్తియగును. 21–36 ఉద్యోగప్రాప్తి వివాహ జీవితము సంతానము పొందుట 37–55 ఆదాయ సమృద్ధి సుఖజీవనము 56 నుండి జీవితాంతము వరకును ఒడిదుడుకులు లేకుండా సుఖకరముగా జీవనం సాధించగలరు.

**235. పుష్యమి నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు శరీరపుష్టి గలవారు, స్థిరమైనబుద్ధి, జ్ఞానముగలవారు, శుచి శుభ్రతలు పాటింతురు. వీరికి కోరికలెక్కువ. అన్ని శాస్త్రాలలోని విషయాలను కొద్ది కొద్దిగా తెలిసికొని ఉంటారు. 1–10 సం॥ మధ్యవయస్సున బంధువులకు దూరమగుట, శ్రమతో విద్యనుపూర్తి చేయుట, 11–20 విద్యాభివృద్ధి జరుగును. 21–30 నూతన ఉద్యోగప్రాప్తి, పెండ్లి యగుట సుఖకుటుంబ జీవనం జరుగును.

**236. ఆశ్లేష నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు వ్యసనాసక్తులు రహస్యములు దాచుటలో వీరు సమర్థులు, మంచి రూపము, దానికితగిన విజ్ఞాన నైపుణ్యము కలిగి జీవింతురు. వీరు 1వ సం॥రం నుండి 10వ సం॥వయస్సు వచ్చు వరకును బంధువుల యింఢ్లలో పెరుగుట తెలివితేటలు వృద్ధి చేసుకొనుట 10–20 విద్యాపూర్తి 21–30 వివిధ ఉద్యోగములలో ప్రవేశించుట, వివాహాది శుభకార్యములు పొందగల్గుట 31–40 వృత్తి ఉద్యోగములలో అభివృద్ధిని సాధించుట, 41–60 రాజకీయలబ్ధిని గృహనిర్మాణములు పూర్తిచేయుట, 61 నుండి

జీవితాంతము ఆలస్యముగా వ్యవహారములు పూర్తిచేయుట, పిల్లలు అన్నిపనులలో సహకరించుట జరుగును.

**237. మఖ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు చక్కని రూపము, విద్య, ఓర్పుకలవారు, చేయుచున్న వృత్తి ఉద్యోగాలలో బాగుగా రాణించగలరు. స్వతహాగా ఆర్జనాపరులు 1-10 సం॥ల మధ్య చిన్నచిన్న అనారోగ్యములతోను 10-20 శ్రద్ధగా విద్యాభ్యాసం 21-30 ఉద్యోగ లాభం, వివాహం ధనలాభం కుటుంబ నిర్వహణ 31-40 చల్లని ప్రశాంత జీవనం, 41-50 అనివార్య ప్రతికూలతలు 51-60 విశేష అభివృద్ధి, ఆపై జీవితాంతము శుభ పాపమిశ్రమ ఫలితాలు పొందగలరు.

**238. పుబ్బ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు సుందరమైన దేహకాంతి కాలవారును, తెలివితేటలు కలిగి లోకజ్ఞానముతో సంచరించువారును, ప్రజ్ఞావంతులును కాగలరు. 1-10వయస్సు మధ్యభాగమున ప్రశాంత జీవనం చేయగలరు. 11-20 విద్యాభివృద్ధి 21-30 వివిధ ఉద్యోగాలలో ప్రవేశము, ధనార్జనము వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, 31-40 జీవితంలో చాల మార్పులు 41-50 ఎక్కువ అభివృద్ధి, ఆపై జీవితాంతం సుఖమయ జీవితం కొనసాగగలదు.

**239. ఉత్తర నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు సామాన్య శరీరము కలిగియుందురు. మీ మాంసచెంది ప్రతిపనిని విడిచిపెట్టుదురు. స్వయంప్రభ తక్కువ. పరుల సలహాలు కోరుచుందురు. 1-10 మధ్యకాలమున అశుభ ఫలితాలు పొందుదురు. 11-20 విద్యాభివృద్ధి 21-30 ఉద్యోగం వివాహం సుఖజీవనం 31-42 ప్రమోషనులు 43-50 ఏవరేజ్ ఫలితాలు పొందుతారు. 51 నుండి జీవితాంతం క్రమాభివృద్ధి.

**240. హస్త నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈజాతకులు బోధపడువరకును ఏ విషయమును విడిచిపెట్టరు. తనకు తెలిసిన విషయమును ఇతరులకు చక్కగా విశదీకరించగలరు. దానధర్మములు చేయుటయందు మిక్కిలి ఆసక్తి కలిగియుందురు. చక్కని రూపము, హాస్య సంభాషణము చేయుటవల్ల వీరు అందరినీ ఆకట్టుకొందురు. 1-10 వయస్సులో ఆటలతో కాలమును గడపుదురు. 11-20 విద్యాభివృద్ధి 21-32 ఉద్యోగం, వివాహం, సుఖజీవనం, 33-43 ప్రమోషనులు ఆపై జీవితాంతము సామాన్య జీవితమును గడపుచుందురు.

**241. చిత్త నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు కళాకాంతులు కలిగి ప్రజలను వశపరచుకొందరు. స్నేహములు జాస్తి. భోగలాలసతకల్గి యుందురు. సాధారణ విద్యావంతులే అయినా మేధావులవలె కన్పింతురు. 1-10 మధ్యవయస్సులో తర్చూ అనారోగ్యములకు గురియగుచుందురు. 10-20 విద్యాభ్యాసం, వృత్తి శిక్షణలు, 21-30 వివాహము, ఉద్యోగ ప్రవేశము స్వంత సంపాదనము 31-40 సామాన్యఫలితాలు 41-56 అన్ని విషయాలలో అభివృద్ధి సాధించగలరు. ఆరోగ్య జీవనము చేయగల్గుతారు.

**242. స్వాతి నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు పైకి ప్రశాంతంగా ఉందురు. లోన ఏదో వేదనలతో కుతకుత లాడుచుందురు. చురుకుగాను, ఆరోగ్యంగాను ఉన్నట్లు కనిపింతురు. 1-10మధ్య ఏవరేజ్ జీవితమును గడుపుదురు. 10-20 ఆటంకములతో విద్యాభ్యాసం, పునరాభివృద్ధి 20-30 ఉద్యోగం, వివాహం, ధనసమృద్ధి, 30-40 స్వార్జిత ధనసంపాదన, నూతన గృహలాభం, 40-50 సన్మానములు ఆరోగ్యములు 50-60 పాప శుభ మిశ్రమ ఫలితాలు పొందగలుగుతారు. ఆపై జీవితాంతము బాగుండ గలదు.

**243. విశాఖ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈజాతకులు చురుకైన బుద్ధిగలవారు, అసూయా పరులు పోటీ పరులై కళలు నేర్చుకొందురు. ధనమును జాగ్రత్తగా ఖర్చు పెట్టుదురు. దాన ధర్మములు చేయ నొల్లరు ఇంద్రియ నిగ్రహం గలవారు, 1-10 ఆరోగ్యంగా అల్లారు ముద్దుగా పెరుగు దురు. 10-20 విద్యాభ్యాసము చురుకుగా సాగును. 20-30 వృత్తి ఉద్యోగములలో ప్రవేశము పెండ్లి చేసికొనుట 30-40 ఆదాయ అభివృద్ధి సంతానాన్ని తీర్చి దిద్దుట 50-60 సామాన్య జీవితమును సాగించుట ఆపై జీవితాంతం సుఖముగా జీవనం సాగించుట జరుగును.

**244. అనూరాధ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈజాతకులకు నూతన స్నేహములు చేయుట చాల ఇష్టం గొప్ప గొప్ప పనులను సాహసించి పూర్తి చేయుచుందురు. ఆస్తులను ఆప్తులను క్షణములో కోపగించి తృణీకరింతురు. శ్రమలకోర్చి అభివృద్ధిలోనికి రాగలరు. 1-10 మధ్య బాలారిష్టములు దాటి బయటపడగలరు. 10-20 ప్రతిబంధకములతో విద్యాపూర్తి 20-30 ముఖ్య బంధువులతో మైత్రి, వివాహము, వృత్తి ఉద్యోగముల నైపుణ్యము 30-40 సాధారణ జీవనము 40-50 ప్రశాంత జీవితం, ఆపై శుభ పాప మిశ్రమ ఫలితములో కాలం

గడచును.

**245. జ్యేష్ఠ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు ధైర్యసాహసములు ప్రదర్శించు వారును ఆరోగ్యవంతులును, సంఘ నాయకులును, కొంతకాలము లేమిని అనుభవించువారును కాగలరు. 10-20 చక్కగా విద్యవచ్చును. 20-30 ఉద్యోగ వృత్తులలో ప్రవేశము, వివాహము సంతానములు 30-40 అదృష్ట యోగం, సుఖ సంసారము గడపుట 40-55 శుభకరమైన కాలం ఆపై జీవితాంతం ఏవరేజ్ ఫలితాలతో గడచును.

**246. మూల నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

జాతకులు ఎట్టని దేహకాంతి గలవారును,గౌరవముగా జీవితమును గడపువారును ఒక్కొక్క సందర్భాలలో పేదరికమును, ఇంకోసారి అదృష్టమును వీరు అనుభవించు చుందురు. 1-10 మధ్యవయస్సులో గండములు, ప్రమాదములు 10-20 ఆటంకాలతో విద్యాభ్యాసము. 20-30 చదువుకి తగిన ఉద్యోగం, వివాహము, సంతానము 30-40 ఏవరేజ్ ఫలితాలు, 40-50 తిరిగి అనుకూలత, ఆపై జీవితాంతము సామాన్య ఫలితా లతో కాలం గడపుదురు.

**247. పూర్వాషాఢ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు ఓర్పుతో సకల విద్యలు నేర్చుకుందురు. తక్కువగా మాట్లాడుదురు. నిదానముగా ఆలోచించి ప్రతి పనిచేయుదురు. నవ్వుముఖముతో సంభాషణమును సాగింతురు. 1-10 సుఖమయ జీవనము 10-20 విద్యాభివృద్ధి 20-30నూతన ఉద్యోగ ప్రవేశము వివాహము 30-40 అసంతృప్తికర జీవితము 40-50 తిరిగి అభివృద్ధి ఆపై జీవితాంతము వరకును గల కాలమంతయు శుభపాపమిశ్రమ ఫలితాలతో కాలము గడపగలుగుతారు.

**248. ఉత్తరాషాఢ నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈజాతకులు విజ్ఞానవంతులు వివేక మెరిగినవారు, శుభ్రత పాటించువారు కాగలరు. దైవభక్తి పరులు, పైకి గంభీరముగా ఉన్నను దయాస్వభావము గలవారు; చక్కగా మాట్లాడగలరు. 1-10 మధ్యవయస్సులో అనారోగ్యములు అగ్నిభయం జ్వరం, 10-20 ఆరోగ్యం, విద్యాప్రాప్తి 20-30 ఉద్యోగ ప్రవేశము, వివాహము 30-50 ప్రశాంత జీవనము చేయుదురు. ధనసంపాదన, గృహనిర్మాణములు 50-60 ప్రయాణ ములు దైవపుణ్య కార్యములు తీర్థయాత్రలు ఆపై జీవితాంతము సామాన్య ఫలితాలు కలుగును.

**249. శ్రవణా నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు చూచుటకు ముచ్చటగా ఉందురు. ఎట్టి వారితో అయినా యిట్టే స్నేహము చేయుదురు. ఇతరులను నమ్మి తమ ఆస్తిపాస్తులను విడిచిపుత్తురు. 1-10 అల్లారుముద్దుగా పెరుగుట 10-20 విద్యలయందానసక్తత, 20-30 స్వతంత్రంగా వృత్తి వ్యాపారాల్లో ప్రవేశము. కుటుంబ పోషణము 30-40 దంతబాధలు, మూలవ్యాధి, 40-50 వ్యాపార నైపుణ్యత, 50-60 ఆస్తి తరగుట, ధనమునకై వ్యాకులత, ఆపై జీవితాంతం ఇతరులపై ఆధారపడి యుండుట.

**250. ధనిష్ట నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు మధ్యమ దేహముతో హావభావములు ప్రదర్శించుచు, ప్రసంగింతురు. చతురభాషణ కటువుగా మాట్లాడుట, రెండింటియందును, ప్రజ్ఞ చూపుదురు. తర్చుగా అనారోగ్యములతో బాధపడుచుందురు. ఆదాయ స్థిరత్వం వీరికి లేదు. 1-10 బాలారిష్టములు 10-20 విద్యకుభంగములు పెంకితనము 20-30 వృత్తి ఉద్యోగాలలో ప్రవేశము వివాహము 30-40 ఆర్జనాపరత ధార్మికత 40-50 ఆస్తితరుగుట 50-60 లేమికి గురియగుట ఆపై జీవితాంతము బంధుమిత్రుల ఆదరణ లభించుట.

**251. శతబిషం నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈజాతకులు బాల్యములో నురుకుదనము కలిగి ప్రవర్తింతురు. యౌవనదశలో లౌకిక మెరుగక చదువుసంధ్యలలో నిమగ్నమై మునిగియుందురు. చదువుకి తగిన ఉద్యోగమును చేపట్టి కుటుంబముతో సుఖజీవనమును సాగించెదరు. 1-10 జలగండము శూల 10-20 విద్యాప్రాప్తి 20-30 ఉద్యోగము వివాహము సంతానములు. 30-40 స్వార్జితధన సంపాదనము 40-50 స్థలములో గృహములో మార్పులు 50-60 ధనప్రాప్తి, గౌరవజీవనం ఆపై సామాన్య ఫలితాలతో యావజ్జీవితము కొనసాగింతురు.

**252. పూర్వాభాద్ర నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు ఆకర్షణీయమైన రూపంతో విద్య వినయము కలిగి ఉంటారు. పెద్దలయందు భక్తి కలిగి సంచరింతురు. చమత్కార సంభాషణము గావింతురు. 1-10 అసౌఖ్య జీవనము 10-20 విద్యాభివృద్ధి సుఖప్రాప్తి 20-30 ఉద్యోగ వృత్తులయందు ప్రవేశము వివాహము 30-40 సంతోషకర జీవనము 40-50 ఏవరేజ్ ఫలితములతో కాలము గడపగల్గుతారు. ఆపై జీవితాంతం పరుల పోషణలో ఉండి జీవితం గడపగల్గుతారు.

**253. ఉత్తరాభాద్ర నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈ జాతకులు రూపశీలములు కలిగి అందరి యెడలను దయకలిగి యుందురు. విద్యా వినయములు ప్రదర్శించుచు బాల్యము గడపుతారు. సత్యము ధర్మమును, పాటింతురు. 1-10 అభిమానముతో పోషింపబడుట 10-20 విద్యాభ్యాసము 20-30 వివాహము సుఖసంసారము 30-40 ధనవృద్ధి 40-50 అనారోగ్యము 50-60 అసంతృప్తి ఆపై జీవితాంతము ఏవరేజ్ ఫలితములు పొందగల్గుతారు.

**254. రేవతి నక్షత్రములో జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఈజాతకులు చామనచాయ దేహముతో తీర్చిదిద్దిన విధంగా కళకళలాడుతున్న ముఖంతో అలరారు చుందురు. ఎన్నో విద్యలలోను కళలలోను ప్రవేశముండును. మంచి ఆరోగ్యవంతులు 20-30 ఉద్యోగ ప్రవేశము వివాహము 30-40 సుఖజీవనం ధనాభివృద్ధి 40-50 పేరు ప్రఖ్యాతులు 50-60 మామూలు జీవనము ఆపై జీవితాంతము పోషణభారమును పుత్రులు వహింతురు.

# జ్యోతిష్ ప్రశ్నోత్తరమాల

## ద్వితీయ అధ్యాయము-సాముద్రిక సమాచారము

**1. సాముద్రిక సమాచారం ఎందుకొరకు తెలిసుకొనుట అవసరం ?**

భగవంతుని సృష్టి విశేషం తెలుసుకోవడం చాలా కష్టమైనపని. మానవునికి పుట్టించినపుడే అతని జీవితమర్మములన్నిటినీ అతని అరచేతుల్లోను, ముఖ శరీర లక్షణములోను లిఖించి భూమిపైకి పంపిస్తాడు అయితే దానిని చదువుకోవడం, అర్థం చేసికోవడం బ్రహ్మవిద్య అనే చెప్పాలి. ఎంతో శ్రమతో కూడినదే యీపని అయినప్పటికి మనం తెలిసికోవడం ముఖ్యం. కొంతమందికి తమ చేతులు ఇతరులకు చూపించడం ఇష్టముండదు. అట్టివారు స్వయముగా సాముద్రిక సమాచారమును ఈ అధ్యాయం చదువుకొని వారి జీవిత విశేషాలు తెలిసికొనుటకై వ్రాయబడినది.

**2. మన తలవ్రాతలు ఎట్లు తెలిసికోగల్గుతున్నాం ?**

జాతకుడు పుట్టిన వేళావిశేషాన్నిబట్టి మనం జాతకం వ్రాయించుకోవడం. ఫలితాలు తెలిసికోవడం కోసం ఒక్క సాముద్రికాన్నేకాక మరికొన్ని శాస్త్రాలుకూడ భగవానుడు ప్రసాదించాడు. అయితే యిప్పుడు దేవుడు వ్రాసిన మనతల వ్రాతలను ఎట్లా చదువుకోవడం అనే విషయాన్ని గురించి ఆలోచిద్దాం. ఒకవేళ చదువుదామను కొంటే అరచేతినిండా ఏవో గీతలే. ఆ కాళ్ళనిండా ఏవో కొక్కెర గీతలే.

**3. గీతలంటే ఏమిటి ?**

మన అరచేతుల్లోను, అరికాళ్ళలోను అలా వ్రాయబడి ఉన్నగీతలనే రేఖలంటారు, రేఖలు, మానవుల గుణాలను ఈ మూడింటిలో హస్త సాముద్రికమునకు విశేష ప్రాముఖ్యమున్నది. హస్త పరీక్షను స్థూలముగా సూక్ష్మముగాను కూడ చేయవలెను.

**4. అరచేతుల్లో గల అదృష్టమెట్లు తెలియును?**

దేవుడు తమ అరచేతుల్లో ఏమి వ్రాసిపెట్టాడో అనే ఆతృతతో చాలమంది కనిపించిన ప్రతి జ్యోతిష్కునికి తమ హస్తాలు అందజేస్తారు. కోయదొరలు, ఎరుకలిసానులు మిడిమిడి జ్ఞానంగల మిడతంబొట్లు వారికి గల అల్పజ్ఞానంతోనే, డబ్బు కక్కుర్తి కోసమో కొన్ని సంగతులు ఏకరువు పెడతారు. అందులోని కొన్ని నిజం కావచ్చును. కొన్ని తప్పిపోవచ్చును. దానికి కారణం లేకపోలేదు, రేఖలపై కొన్ని కత్తెరలుగాని ఖండనలుగాని ఉండవచ్చును. అవి లోతుగాను స్పష్టంగాను ఉంటే ఒక ఫలం, బలం తక్కువగా తేలికగా ఉంటే ఇంకోరకం ఫలితాలు కలుగజేస్తాయి. పూర్ణాయుర్దాయం గల ఒక ఆసామికి 25 ఏట చిన్న కత్తెర రేఖ ఉంటే అది గండమే తప్పిపోవచ్చును. 25వ సంవత్సరం వయసులో అతడు చనిపోతాడని ఎవరో చెప్ప వచ్చును.అది విని జాతకుడు కృంగిపోవచ్చు గదా!

**5. సాముద్రిక శాస్త్రము ఎటువంటిది?**

కొంతమంది సాముద్రిక శాస్త్రాన్ని సోదెక్రింద కొట్టి పారవేస్తారు. కాని శాస్త్ర మెన్నటికీ శాస్త్రమే. ఈ శాస్త్రం అన్ని దేశాల్లోను విశిష్టమైన పేరు సంపాదించుకొంది.

విధి వ్రాసిపెట్టిన అరచేతుల్లోని రేఖా ఫలితాలను శీలాన్ని అదృష్టాన్ని కష్టాలను తెలియజేస్తాయి. పూర్వ ఋషులు వీనికి సంబంధించిన వివరాలను గూర్చి శ్లోకాల్లో తెల్పియున్నారు. దైవజ్ఞులు వాని తాత్పర్యమును గ్రహించి విశదపరచిరి. అని తెలిసికొనడంవల్ల మన భవిష్యత్తు ద్యోతకమవుతుంది. పాదాల అడుగున గీతలకన్న పాణితంపై ఉన్న గీతల్లో నిబిడీకృతమైయున్న విశేషాలు మనమిప్పుడు తెలిసికొందాం సాముద్రికం' జాతకం ఇవి రెండూ మన జీవితానికి సర్టిఫికెట్ వంటివి.

**6. బ్రహ్మ లిపి ఎట్లు తెలిసికొనవచ్చును ?**

కొన్ని సంకేతముల ద్వారా భాషలకు సంబంధించిన లిపిని తెలిసికొనుటకు చాలమంది సమర్థులు కావచ్చును. కాని లలాట లిఖితమైన బ్రహ్మలిపిని ఏ కొద్దిమంది త్రికాలజ్ఞులు మాత్రమే చదివి ఫలితమును తెలుపగలరు.

సాముద్రిక శాస్త్రమునకు అవధులులేవు. సముద్రుని వలె గంభీరమైనది. పూర్వం ఈ శాస్త్రము మనదేశములో ఉద్భవించి మధ్యకాలములో నీరసించి యిప్పుడు వృద్ధి యైనది.

**7. సాముద్రిక మనగా ఏమి ?**

సాముద్రికమనగా ముద్రలతో కూడినదని అర్ధం. అనగా అరచేతులలోని ముద్రలను చదివి ఫలితములను తెలిసి కోగలిగే శాస్త్రమే సాముద్రిక శాస్త్రమన్నమాట దీనిని ముఖ్యాంగా మూడు భాగాలుగా విభజించవచ్చును. 1. హస్త సాముద్రికం 2. అంగసాముద్రికం 3. స్త్రీ సాముద్రికము, తెలిసికోవడం అంత తేలికైన పనికాదు. నుదుటిమ్రాత వ్రాసిన ఆ విధికే ఆ సంగతులు తెలియాలి. అయితే ప్రఖ్యాత దైవజ్ఞుడు నిష్కళంకమయిన మనస్సుతో వాటిని పరిశీలించి వీలైనంతవరకు జాతకంతో సరిపోల్చి యదార్ధ విషయాలను చెప్పడానికి ప్రయత్నిస్తాడు.

**8. కొంతమంది సాముద్రిక శాస్త్రవేత్తల పేర్లను తెల్పుము.**

సంస్కృతంలో నారదుడు. ప్రహ్లాదుడు, వరాహమిహిరుడు, వరరుచి మొదలగు వారు సాముద్రిక లక్షణాలను శ్లోకాల్లో నిబంధించారు. అవి తెలుగులో అనువాదాలు చేయబడ్డాయి. సాముద్రిక శాస్త్రగ్రంథాలు కూడ జ్యోతిషం పుస్తకాలతో పోటీ పడుతున్నాయంటే ఆశ్చర్యపడనక్కరలేదు. దీనికి గణితంతో చాలా పని ఉంటుంది. కనుక ఇది యదార్థమైన విషయమని అందరూ ఒప్పుకోక తప్పదు.

**9. హస్తరేఖా పరిశీలనకు ఏదైనా సూత్రములు గలవా?**

ఇప్పుడు హస్తరేఖా పరిశీలనకు ముందుగా గమనింప వలసిన కొన్ని సూత్రాలను పరిశీలిద్దాం. పురుషులకు నాడిచలన ప్రభావం కుడిప్రక్క, స్త్రీలకు ఎడమప్రక్కను వుండటంవల్ల మగవారికి కుడిచేతిని ఆడవారికి, ఎడమచేతిని చూచి ఫలితాలు చెప్పుకోవలసి ఉంటుంది. సాముద్రికం మూడు విధములని చెప్పుకున్నాం కదా! ఇప్పుడు హస్తసాముద్రికమును గూర్చి ముందుగా చర్చించుకుందాం.

**10. అరచేతిలో గల రేఖలను తెల్పుము?**

అరచేతిలో 1. ఆయుర్దాయము రేఖ 2. ఆత్మరేఖ 3. శీర్షరేఖ 4. ధనరేఖ 5. వివాహరేఖ 6. సంతానరేఖ 7. విద్యారేఖ 8. బుధ,రాశి శుక్రరేఖలు, ఇవియేకాక శంఖములు. చక్రములు శూలములు, పద్మములు, విచారరేఖలు మొదలగునవి కూడా అరచేతిలో ఉంటాయి. వ్రేళ్ళపైన మరికొన్ని ఉంటాయి. స్థూల రేఖలనుబట్టి ఫలితములు చెప్పుట సులభం కావచ్చును. కాని సూక్ష్మరేఖలను బట్టి ఫలితాలు వివరించడం

ప్రజ్ఞతో కూడిన ప్రక్రియ, అరచేయి మెత్తగా ఉండి అందలి రేఖలు సన్నగా తల వెంట్రుకలవలె ఉండాలి. లావుగా మొద్దుబారి ఉన్నచో ఫలశూన్యతను కలిగించును బారీ శరీరమందు ఎచ్చటెటచ్చుట ఎన్ని రేఖలున్నప్పటికీ హస్తరేఖలకు గల ప్రాముఖ్యం మరి నేటికీ లేదు.

**11. అరచేతిలో గల గ్రహముల స్థానములను తెల్పుము ?**

బొటన వ్రేలికి దగ్గరగా శుక్రస్థానము, అరచేతి వెలుపలి అంచు దగ్గర చంద్రస్థానం, ఆత్మరేఖకు దగ్గరగా కుజస్థానం, చిటికెన వ్రేలికి దగ్గరగా బుధస్థానం, మధ్యమవ్రేలి క్రిందగా శనిస్థానం, చూపుడు వ్రేలికి క్రిందుగా గురుస్థానం అదృష్టరేఖ ప్రక్కగా, సూర్యరేఖ ఉంగరపు వ్రేలు ప్రాంతమున ఉండును.

**12. హస్తమునందు గల 5 వ్రేళ్ళకు గల పేర్లేమి ?**

1. బొటన వ్రేలు – అంగుష్టము (శుక్రాంగుళి)
2. చూపుడు వ్రేలు – (తర్జన్యంగుళి)
3. మధ్యవ్రేలు – మధ్యమాంగుళి
4. ఉంగరపు వ్రేలు – ధర్భముడి వ్రేలు
5. చిటికెన వ్రేలు – బుధాంగుళి

చేయిచూచి ఫలితములు చెప్పునప్పుడు ముందుగా ఆయుర్దాయ రేఖను నిశితముగా పరిశీలించి ఆయువును నిర్ధారణ చేసికొని ఆపై మిగతా విషయాలను చెప్పవలెను.

**13. హస్తం ఎట్లుండవలెను ?**

హస్తం అనగా అరచేయి ఇది లేదగులాబిరంగుగలదై మెరయుచు జీవకళ కలిగి ఉండవలెను. మాంసపుష్టముగా పొడవైన వ్రేళ్లు, సమమైన గోళ్ళు అరచేతికి అమరియుండవలెను. అరచేయి దళసరిగాను మోటుగాను ఉన్నవ్యక్తులు దయా విహీనులు. దరిద్రమూర్తులు కాగలరు. కురుచగా ఉన్నవారు భాగ్యశూన్యులు కాగలరు వ్రేళ్ళు దగ్గరగా ఖాళీలు లేకుండా ఉండవలెను. అట్లున్న జాతకులు ధనవంతు లగుదురు. ఖాళీలు ఎక్కువగా ఉన్నవారు వ్యయపరులగుదురు. చిటికెనవ్రేలు పొడవుగా ఉన్నవారు కళాహృదయులు విద్యా వివేకములు గలవారు కాగలరు.

**14. ఆయుష్య రేఖను గురించి వివరింపుము ?**

అరచేతిలో ఉన్న ముఖ్యరేఖలలో ఇది ఒకటి. మానవ జీవితకాల ప్రమాణమును ఇది నిర్ధారించును. ఇది బొటనవ్రేలు మీదుగా పుట్టి అరచేతి మధ్యనుండి ప్రాకి చేతి

మణికట్టు సమీపమున తాకును. స్త్రీ పురుషుల ఆయుర్దాయమును యీ రేఖ ఆధారముగా తీసికొని జ్యోతిష్కులు చెప్పుదురు. పురుషులకు కుడి చేతిలోను స్త్రీలకు ఎడమ చేతిలోను ఈ రేఖలను పరీక్షించవలెను. ఆయుర్దాయమును సంవత్సరములలో లెక్కించునపుడు బొటనవ్రేలు ప్రక్కనుండి దిగువకు లెక్కించవలెను. మణికట్టును ఇది తాకినచో ఆ వ్యక్తి ఆయుర్దాయం 100 సంవత్సరములు పై నుండి దిగువకు దీనిని లెక్కించునపుడు నాలుగు సమభాగములు చేసిన ఒక్కొక్క భాగం 25 సంవత్సరములుగా భావింపవలెను. ఒక దారముతో దీనిని కొలిచి మడతపెట్టి లెక్కకట్టవచ్చును. కొందరు ఈరేఖ సంపూర్ణముగా ఉన్నప్పుడు మానవుని పరమాయుర్దాయము అయిన 120 సంవత్సరము లుగా లెక్కకు తీసికొందురు. ఈరేఖపై అడ్డుగీతలున్నను రేఖమధ్యలో తెగియున్నను ఆ కాలములో జాతకునకు గండములున్నట్లు తెలియవలెను. గండము గడచిన మరల ఈ రేఖను లెక్కకట్టి పూర్ణాయుర్దాయమును నిర్ణయం చేసికొనవచ్చును.

**15. శీర్షరేఖ అనగా నేమి ?**

దీనికి కళత్రరేఖ అని మరియొక పేరుగలదు యిది కూడ ప్రధానమయిన మూడు రేఖలలో ఒకటి. ఇది బొటన చూపుడు వ్రేళ్ళకు మధ్యభాగమునుండి పయనించి అరచేతి మధ్యగా వెలుపలి అంచువైపు ప్రాకును, ఇది అరచేతిలో మధ్యగాపోవు రేఖ ఈ రేఖ ఆయుర్దాయరేఖతో బొటనవ్రేలివద్ద కలియును. ఈ రేఖ భార్యకు సంబంధించిన విషయములు తెలుపును. ఇది తెగినచో భార్యకు జబ్బు చేయుటగాని ఆ జాతకునకు ద్వితీయ వివాహము జరుగుట గాని కావచ్చును.

**16. శీర్షరేఖ అనగా ఏమి ?**

ఈ రేఖ చిటికెన వ్రేలికి అరచేతి అంచున మొదలిడి చూపుడు వ్రేలి చివరవరకు ప్రాకును, హృదయరేఖ అని దీనికి మరియొక పేరు గలదు.దీనిని కొంతమంది ఆయుర్దాయరేఖగా కూడ గుర్తించెదరు. ఇది జాతకుని గుణగణాలు, బుద్ధిలూ, మనో ప్రవృత్తులు తెలుపును. దీనిపై అడ్డురేఖలున్నచో సౌఖ్యభంగం, విచారములు ఆ జాతకుని పెనవేయును.

**17. ధనరేఖ గురించి వివరింపుము ?**

దీనికి అదృష్టరేఖ అని ఇంకొక నామధేయం కలదు. ఈ రేఖను పోల్చుకొనుట సులభమే. ఇది కంకణిరేఖ వద్ద బయలుదేరి అరచేతి మధ్యనుండి తిన్నగా మీదికి పోవును, ఈ రేఖ జాతకుని భోగభాగ్యములను తెలియజేయును. మణికట్టు వద్ద ప్రారంభించబడిన బాల్యం నుండి ఆ జాతకుడు ధనవంతుడు యగును. అరచేతి మధ్యయందిది ప్రారంభమైనచో ఆ జాతకుడు స్వయం ప్రజ్ఞచే ఆర్జనాపరుడు కాగలడని

ఎరుగవలెను. ఈ రేఖ ఎప్పుడూ ఒకేలాగ ఉండదు. జాతకుని పరిస్థితులను బట్టి అది కూడ మారుచుండును. స్పష్టముగా లోతుగా యీ రేఖ ఉన్నవారు ద్రవ్య సంపన్నులు కాగలరు. లాటరీలలో గెల్చునపుడు ఆస్తి పతనమైనప్పుడు ఇది వెంట వెంటనే మార్పు చెందు చుండును. ఈ రేఖపై ఆ అడ్డుగీతలున్నను, ప్రక్కన మరికొన్నియు రేఖలు కలిసిఉన్నను, స్థిరాస్తి నిర్ణయం చేయుట కష్టం.

**18. వివాహ రేఖ అరచేతిలో ఎచ్చట ఉండును ?**

ఈ రేఖ చిటికెనవ్రేలి క్రింద అరచేతి అంచున అడ్డముగా గీయబడియుండును. ఇవి కొంతమంది చేతుల్లో రెండు మూడు ఉన్నట్లు, అస్పష్టముగా ఉన్నట్లు కన్పించును. అయినప్పటికీ ఒకేపెండ్లి జరుగును. అన్ని సంబంధములు వచ్చి తప్పిపోవును. ఇది వ్రేళ్లవైపుగా ఎగబ్రాకినచో అట్టి జాతకుడు బ్రహ్మచారి కాగలరు. ఈ రేఖా సవ్యముగా స్పష్టముగా కలవారికి అనుకూలవతియగు భార్య లభించును.

**19. చేతిలో సంతాన రేఖలుండు చోటేది ?**

ఈ రేఖల చిటికెన వ్రేలి క్రిందనుగల అరచేతి వెలుపల అంచున వివాహరేఖపై అడ్డముగా గీయబడి ఉంటాయి. కుడి ప్రక్కగా పురుష సంతాన రేఖలు ఎడమ ప్రక్కగా స్త్రీసంతాన రేఖలు మొలిచి ఉంటాయి. విద్య రేఖ ఉంగరపు వ్రేలి దిగువగా అరచేతిలో వుంటుంది. అరచేతిలో ఇంకా ఎన్నో రేఖలుకూడా వుంటాయి. వాటివల్ల జాతకుని ఔన్నత్య హీనస్థితిలెన్నియోద్యోకతం కాగలవు.

**20. చేతులలోని రకములను తెల్పుము ?**

1. చరస్రహస్తం 2. సామాన్య హస్తం 3. కాళహస్తం 4. ఆదర్శహస్తం 5. మిశ్రమహస్తం 6. ఆదోక హస్తం. ఈ విధముగా చేతులలో చాల రకములు గలవు. ఏ హస్తమైనను మృదువుగా ఎరుపు రంగు గలదై వుండుట శుభకరము. పద్మంవలె మెత్తగా చేతులుండవలెనేగాని పిడకవంటి చేతులు మంచివికావు.

**21. వ్రేళ్ళు గురించి నీకేమి తెలియును ?**

చేతికిగల వ్రేళ్లు అయిదు. అందు 1. బొటనవ్రేలు 2. చూపుడువ్రేలు 3. మధ్యవేళ్లు 4. ఉంగరపు వ్రేలు 5. చిటికెన వ్రేలు. వ్రేళ్ళపై కణుపులుండును. కణుపులమధ్య చక్రములు శంఖములు మొదలయినవి వుంటాయి. మధ్యవ్రేలు అన్నిటి కన్నా పొడవుగా ఉంటుంది. నిండుగా పుష్టిగా వ్రేళ్ళు దగ్గర దగ్గరగా వుండవలెను. చిటికెన వ్రేలు అన్నిటికన్నా చిన్నది. వ్రేళ్లు పొడవుగా వున్నవారు ఆలోచనాపరులు కార్యసాధకులు కాగరు. పొట్టి వ్రేళ్లు గలవారికి తొందరపాటు యెక్కువ.

**22. గోళ్ళు యెటులుండవలెను ?**

గోళ్ళు చతురముగా సన్నముగా ఎరుపురంగులో వుండుట శ్రేష్ఠం పాలిపోయినట్లుండుట అశుభసూచకం. అంతేగాక అనారోగ్య లక్షణం, పొడవుగా గోళ్లుండరాదు. అట్లుండుట భాగ్య హీనతకు చిహ్నం.

**23. పుట్టుమచ్చలు గూర్చి నీకేమి తెలియును ?**

పురుషులకు ఫాలభాగమున పుట్టుమచ్చలుండుట భాగ్యప్రదం నుదురు విశాలముగా వుండుట ఐశ్వర్యకారణం అధిక మేధాశక్తికి చిహ్నం, మగవారికి కుడిభాగమున కణతలో కంటిలో పుట్టుమచ్చలుండిన ధన ధాన్య సమృద్ధికల్గును. ముక్కుకి కుడివైపు ముక్కు చివరను పుట్టుమచ్చలుండిన కార్యసిద్ధి. ధనలాభం, గడ్డముమీద, దౌడమీద, పెదవిమీద పుట్టుమచ్చలుండుట శుభం.

**24. స్త్రీ సాముద్రికం గురించి తెల్పుము ?**

భగవంతుని సృష్టిలో మానవులందరూ ఒకేమాదిరిగా ఉండరు. ఏమాత్రమైనా తేడాలు కన్పించును. అందరూ అందంగా ఉండరు. కాని అటుల ఉండుటకు ప్రయత్నించెదరు. అయితే అందముగా ఉన్నవారు అదృష్టవంతులు గాను, అనాకారిగాను ఉన్నవారు దురదృష్టవంతులు గాను సాముద్రిక శాస్త్రములు చెప్పుచున్నవి. స్త్రీల శరీర మెటులుండవలె ననగా మిక్కిలి కృషించినది గాక ఎక్కువగా బలిసినది గాక సమమై పుష్టిగా మృదువుగా ఉండవలెను. నల్లని జుత్తు తామరల వంటి బాహువులు, శంఖం వంటి కంఠం ఉండవలెను. పాదములు చిన్నవిగా వుండవలెను. కాళ్ళు అరటి స్థంభములవలె వుండవలెను. ధృఢమైన వక్షస్థలం తెల్లని దంతములు, లోతయిన నాభి, ఆకర్షనీయమైన ముఖము కలిగి స్త్రీ చెలువార వలెను. స్త్రీ నడచునప్పుడు కాలి చిటికెన వ్రేలు భూమికి తాకవలెను.

**25. సుడుల వలన మంచి చెడ్డలేమి ?**

స్త్రీలకు పిరుదుల మీద సుడియుండిన పరగృహములలో సేవకురాలగును. ముఖము నందున్నచో భర్తృహీనురాలు అగును. తలమీద దురదృష్టవంతురాలు, కంఠమునందు సంతాన హీనురాలు, భుజముల యందు, కర్ణములయందు, గడ్డముపై స్త్రీలకు వెంట్రుకలుండరాదు మీసములు మొలచుట కూడా అశుభ సూచకం. స్త్రీలకు ఎడమ భాగమున, పురుషులకు కుడి భాగమున పుట్టుమచ్చలుండుట శుభకరం.

**26. అంగ సాముద్రికమనగా ఏమి? స్త్రీ పురుషులకు యిరువురకు అన్వయించు ఫలితాలు తెల్పుము ?**

అంగ సాముద్రికమనగా మఖ లక్షణాలు, కాళ్ళు చేతులు మొదలయినవి గురించి చెప్పుశాస్త్రం, శరీరం కండపుష్టి కలిగి కాంతి వంతమై కామరూపమున ప్రదర్శింపవలెను. ఎముకలు కన్పింపకూడదు. బక్క చిక్కినటుల కనబడిన దరిద్రలక్షణము కాలివ్రేళ్ళ నుండి ఎవరి జానతో 7 జానలు వుండవలెను. అందు ముఖ్యంగా రథం, పుష్పం, చేప, కడవ, పూలమాలిక, అంకుశం, యిట్టి గుర్తులు కనిపించిన ఆ జాతకుడు అదృష్టవంతుడగును.

**27. పాదము లెటులుండవలెను ?**

పాదములు కోమలంగాను సమానంగా వుండవలెను. కఠినము లయినవి. నరాలు కనిపించునవి దురదృష్టమును సూచించును. వ్రేళ్లు యెడల లేక కణుపులు కలవిగా వుండాలి.

**28. పిక్కలెట్లుండవలెను ?**

పిక్కలు కృషించియున్నను, ఎక్కువ రోమాలు కలిగియున్నను, అట్టి జాతకులు దరిద్ర మనుభవింతురు. మృదువుగా కొద్దిరోమాలు కలదై గుండ్రంగాను, కాస్త పొడవుగాను వుండినవాడు అదృష్ట జాతకులు కాగలరు.

**29. తొడలెటులుండవలెను?**

తొడలు అరటిబోదెలవలె మొదట లావుగాను, క్రమంగా సన్నంగాను వుండవలెను. మోకాళ్ళు మృదువుగా వుండవలెను. పిరుదులు బలిసి యుండవలెను.

**30. నడుమెట్లుండవలెను ?**

సింహం నడుంవలె సన్నముగా నడుముండవలెను పంది గాడిదలను బోలు నడుము దరిద్రం కలిగించును. కడుపు మండలాకారంగా యెత్తు తక్కువగా వుండవలెను. కడుపుపైకి మడతలుండుట శుభసూచకం, బొడ్డు లోతుగా విశాలంగా వుండవలెను. ఎముకలు, డొక్కలు కనిపించకూడదు.

**31. రొమ్ము ఎట్లుండవలెను?**

రొమ్ము దీర్ఘంగా పుష్టిగా వుండవలెను. ఇందు పై కఠిన రోమాలుండరాదు. ఎముకలు పైకి కనిపించరాదు. హెచ్చు తగ్గు లుండుట దరిద్రహేతువు, గూని యుండుట దరిద్రం.

**32. చేతులు ఎటులుండవలెను ?**

చేతులు బలిష్ఠమైన నునుపు గలిగి వున్నతమైయుండవలెను. నరాలు కన్పించరాదు. దీర్ఘహస్తాలు శుభసూచకం. చేతుల వ్రేళ్లు, గోళ్లు ఎరుపురంగు కలవిగా యుండవలెను. కోతి, పులి వీనిచేతులవంటివి అభాగ్యలక్షణం. భుజాలు ఎత్తుగ విశాలంగా వుండవలెను.

**33. మణికట్టు ఎట్లుండవలెను ?**

అరచేతికి క్రిందుగా – అరచేతిని కలిపే స్థలాన్ని మణికట్టు అంటారు. ఇందు నాలుగు రేఖలుండుట అదృష్టం. 2,3 రేఖలు అయిన సుఖము నిచ్చును.

**34. కణుపులు అనగా ఏమి?**

చేతివ్రేళ్ళ మీద గీతలవలె అడ్డముగా యీ కణుపులుండును. ఐదు వ్రేళ్లపై మొత్తం 12 వుండిన అదృష్టం.

**35. యువరేఖ అనగా ఏమి ?**

బొటనవ్రేలి కణుపునకు పైన బియ్యపుగింజవలె వుండునది యువరేఖ వ్రేలి కొనలయందు శంఖము చక్రం వంటి రేకలు కూడా వుండును. 1,2,3, చక్రములుండుట శుభం.

**36. సర్వరేఖా అనగా ఏమి ?**

కణుపునే స్వరరేఖా అందురు. అరికాళ్లలో కూడా చక్రములుండును. ఇవి తెగియుండరాదు.

**37. విద్యారేఖ ఎట్లుండును ?**

ఇది వుంగరపువ్రేలికి క్రింద అరచేతిలో సన్నని పొడవురేఖ–ఈరేఖా జాతకుని విద్యా విషయములను తెల్పుము. దీనిపై అడ్డురేఖలుండిన విద్యకు భంగములు కల్గును.

**38. చేతిలో ఎక్కువగా రేఖలుండుట మంచిదా కాదా ?**

చేతిలో ఎక్కువగా రేఖలుండుటవలన నిర్ధసత్వమును విచారములను సూచించును. ఇందులో చాల వరకు విచారరేఖలే అగుచుండును.

**39. పురుషుల కేచేయి చూచి ఫలం చెప్పవలెను ?**

పురుషులకు కుడిచేయి చూచి ఫలితములు చెప్పవలయును. అతడి ఎడమ చేతినిబట్టి భార్య సంగతులు చెప్పవచ్చు.

**40. స్త్రీలకు ఏచేయి చూచి ఫలితములు చెప్పవలెను ?**

స్త్రీలకు ఎడమచేయి చూచి ఫలితాలు చెప్పవలెను. స్త్రీలనాడి చలన మటులుండును. భర్త సంగతుల కొఱకు ఆమె కుడిచేతిని చూచి చెప్పవలెను.

**41. పెదవులు యెట్లుండవలెను ?**

పెదవులు యెరుపురంగు కలదయి వుండవలెను సిద్దు పెదవులు దుఃఖహేతువు పలుచగా తడిగా వుండవలెను.

**42. మీసము లెట్లుండవలెను ?**

మృదువుగా సమముగా ఉండవలెను. అతి లఘువుగాను మొద్దుబారి యుండరాదు. దంతములు తెల్లగా నుండవలెను.

**43. నోరెట్లుండవలెను ?**

నోరు సమమై పలుచగా నుండవలెను. పొడవు నోరు భాగ్యహీనము పొట్టిగా మృదువుగా నుండుట మంచిది నాలుక సన్నముగా, పొడవుగా యెర్రగా నుండవలెను.

**44. చెవులు ఎట్లుండవలెను ?**

చెవులు మాంసరహితమై, చప్పిగా నుండరాదు. దీర్ఘముగా పెద్దవిగా నుండవలెను. చెవులలో వెంట్రుకలుండుట భాగ్య చిహ్నము.

**45. ముక్కు యెట్లుండవగును ?**

ముక్కు పుష్టిగా సమముగా నుండవలెను, చిలుక ముక్కువలె నుండుట శుభం. కఠినముగా చప్పిడి ముక్కు వుండరాదు.

**46. లలాటరేఖ అనగా ఏమి ?**

ప్రతివారికిని నుదుటిపై రేఖలుంటాయి. అరచేయి చూచి జాతకమును చెప్పినటులే లలాటరేఖలను బట్టి జీవితఫలాలు చెప్పవచ్చును. నుదుటిపై మూడు రేఖలుండుట వలన దీర్ఘాయువు. ఈ రేఖలు వంకర తిరిగి కనుబొమ్మలవద్ద ఆగినచో దురదృష్టం.

**47. శిరస్సు యెటులుండవలెను ?**

శిరస్సు వెడల్పుగా నుండవలెను. కుండలాగ, చప్పిగాను ఉండరాదు. వెంట్రుకలు నునుపుగాను, నలుపుగాను వుండవలెను. కూపములవద్ద ఒక్కొక్క వెంధ్రుకయే వుండవలెను.

**48. గడ్డ మెటులుండవలెను ?**

తాటి బీజమువలె గడ్డముండవలెను. ముందుగా మీసములు ఆ తర్వాత గడ్డం మొలచుట శ్రీకరం.

**49. చేతిలో నవగ్రహాల గుర్తు లెటులుండును ?**

వర్తుల రేఖగా సూర్యుడు చతురస్ర కోణరేఖగా చంద్రుడు. త్రికోణ రేఖగా కుజుడు, బాణరేఖగా బుధుడు, దీర్ఘరేఖగా రాహువును, ధ్వజరేఖగా కేతువును హస్తము నందు గోచరింతురు.

**ఒక ముఖ్య గమనిక :–** అనివార్య కారణములచే జ్యోతిష ప్రశ్నోత్తరమాల లోని పేజీలు సీరియల్‌గా వేయలేకపోయాము. ఏ అధ్యాయములోని ప్రశ్నలకు, పుటలకు ఆ అధ్యాయమునకు సంబంధించిన సంఖ్యాలనే వేసితిమి. యింకను యిట్టి చిన్న చిన్న లోట్లను పాఠకులు సవరించుకొందురు గాక! చం॥జ్యో॥

# జ్యోతిష ప్రశ్నోత్తరమాల

## 3వ అధ్యాయము

విస్తృత పరచిన విషయాలతో ప్రశ్నోత్తర రూపమున వ్రాయబడిన నాలుగవ ముద్రణకు సంబంధించిన ప్రతి యిది.

(జాతకం తెలిపే 3 శాస్త్రాలలో ఇది ఒకటి)

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 6 | 7 | 8 | 9 | 10 |

1–9 ఆధార సంఖ్యలు–10 నుండి కోట్ల వరకు విస్తార సంఖ్యలు. ఇందులో సంఖ్యాశాస్త్రమునకు సంబంధించిన 24 విషయాలపై ప్రశ్నలు, జవాబులు, కలవు.

ముందు పేజీలలో విపుల విషయసూచిక గలదు.

## సంఖ్యాశాస్త్ర మర్మములు

**1. నవగ్రహాలకు నవసంఖ్యకు గల సంబంధమెట్టిది?**

ఒకటి నుండి 9వరకు గల అంకెలకు నవగ్రహాలకు ఒక విధమైన అవినాభావ సంబంధం గలదు. ప్రపంచంలో పుట్టిన అందరూ ఈ తొమ్మిది అంకెలకు సంబంధించిన జాతకులే కాగలరు. కోట్లకొలది అంకెలున్నా ఈ తొమ్మిది అంకెల ఆధారముతోనే అవి అన్నియు ఏర్పడుచున్నవి.

**2. సంఖ్యా శాస్త్రంయొక్క గొప్పదన మెట్టిది ?**

పుట్టినవారికి సరియైన తేదీ, టైము ఉన్నప్పుడే జాతక ఫలితములు తెలుసుకొనుట సాధ్యం. ఏ మాత్రం కాల భేదం వచ్చినా ఫలితాలు తప్పి పోతాయి. ఇక సాముద్రిక రీత్యా ఫల సాధనకు దిగితే ఆయుష్య అదృష్ట రేఖలను ఎంత సునితంగా పరిశీలించినా కొన్ని నెలలయినా తేడా కనిపించవచ్చును. ఇందు నిమిత్తం మన ప్రాచీన మహర్షులు సంఖ్యాశాస్త్రమను నొకదానిని ఏర్పరచిరి ఇది కూడా నేటికాలం అత్యంత ప్రాధాన్యతను సంతరించుకొన్నది.

**3. సంఖ్యాశాస్త్రమునకు ఏయే శాస్త్రములతో సంబంధమున్నది?**

ఈ శాస్త్రం నేర్చుకొనువారు దీనితో సంబంధముగల జ్యోతిష సాముద్రిక శాస్త్రములు కూడా నేర్చుకొనుట ముఖ్యం. ఎందుచేతననగా గుప్తముగా దాచబడిన మానవుల భవిష్యత్తును తెలిసికొనుటకు ప్రయోజన కరములైనవి యీ మూడున్ను.

**4. సంఖ్యాశాస్త్ర ఫలితాలు రూఢిగా చెప్పగలుగుటకు వేటి వేటికి పరస్పర సంబంధం కలదు?**

గృహములు, సంఖ్యలు, కాలం, వీనికి పరస్పర సంబంధమున్నది. అందువల్లనే యీ మార్గం ననుసరించి చెప్పే ఫలితాలు ఖచ్చితమయినవి కాగలవు. ఇది గణిత సంబంధమైనది. కావున తప్పి పోవుటకు ఎట్టి ఆస్కారములు లేవు.

**5. సంఖ్యాశాస్త్ర ప్రాముఖ్యమును వివరింపుము?**

జ్యోతిష సాముద్రిక శాస్త్రములవలెనే సంఖ్యా శాస్త్రముకూడా మానవుల భవిష్యత్తుకు మనుగడకు అత్యంత ప్రాధాన్యమయినది. దీనికి మనదేశములోకంటే మిగతాదేశములలో ప్రచార మెక్కువ 9 అంకెలలో అన్ని అంకెలు అణగిపోతాయి. సున్నకు ప్రత్యేకమైన విలువలేదు ఒక అంకెకు కుడిప్రక్కను చేరిస్తేనే దానికి విలువ ఏర్పడుతుంది. 1 నుండి 9 వరకు గల సంఖ్యలు వందలు వేలు ఏర్పడ్డవి విస్తార సంఖ్యలెంత పెద్దవయినా ఆధార సంఖ్య లోనికి మార్పు చేసికో వీలుకలదు.

**6. జాతకులు విభజన ఎటుల జరుగును ?**

ఏఏ తేదీలలో పుట్టినవారు ఏఏ జాతకులు కాగలదో వారి లక్షణములు. అదృష్ట దురదృష్టములు ఎలావుంటాయో తెలుసుకోవడం చాలా సులభమయిన పని. ఇక సంఖ్యాశాస్త్రమర్మములలో ఒకటి.

ఒక్క పుట్టిన తేదీనే తీసుకోని ఆ సంఖ్యకు అధిపతి ఎవరయిన తెలిసికొని అందువల్ల ఫలితం పొందుట ఒకమార్గం. రెండవరుస సంఖ్య వచ్చినపుడు ఆ రెంటిని

కలిపిన సంఖ్యవల్ల సంఖ్యాదిపతి తెలియును 24వతేదీ అంటే రెంటిని కలుపగా 6వ సంఖ్య అయినది. 6వ సంఖ్యకు అధిపతి శుక్రుడని తెలియవలెను.

**7. అశ్విన్యాది నక్షత్రములలో పుట్టినవారికి అదృష్ట సంఖ్యలేవి?**

అదృష్ట సంఖ్యలు
అశ్విని, మఖ, మూల - 7 - ఆర్ద్ర, స్వాతి, శత - 4
భరణి, పుబ్బ, పూ॥షా - 8 - పునర్వసు, విశాఖ, పూ॥భా - 3
కృత్తిక, ఉత్తర, ఉ॥షా - 1 పుష్యమి, అనూరాధ, ఉ॥భా-6
రోహిణి, హస్త, శ్రవ-2 ఆశ్లేష, జ్యేష్ట, రేవతి-5

మృగశిర, చిత్త, ధనిష్ట-9 జన్మ, నామతారలైన వారికి

**8. సంఖ్యలు ఎన్ని విధములు ?**

రెండు విధములు 1. ఆధార సంఖ్యలు 2. విస్తార సంఖ్యలు, ఆధార సంఖ్యలనగా ఒక్కొక్కటి వేరు వేరుగా ప్రత్యేకమయిన రూపం కలిగియుండునవి. విస్తార సంఖ్యలనగా ధారసంఖ్యల సహాయం తోడనే విస్తార మొందునవి. కావున ఆధార సంఖ్యలు లేనిదే విస్తారసంఖ్య లుండవు. 1 నుండి 9 వరకు గలవి ఆధార సంఖ్యలు.

**9. ఒక విస్తార సంఖ్య ఆధార సంఖ్యలోనికి ఎట్టు మార్చుకొందువు?**

24867 ఇది ఒక సంఖ్య. వరుసగా ఒకదానికొకటి కలువవలెను. 2+4+8+6-7=27; 2+7=9 అనే ఆధార సంఖ్యలోనికి పరివర్తనమైనది.

**10. ఏఏ అంకెలు ఏఏ గ్రహాలకు సంబంధించినవి ?**

ఒకటవ అంకె సూర్యునకు, 2వ అంకె చంద్రునికి 3వ అంకె గురునకు, 1వ అంకె రాహువునకు, 5వ అంకె బుధునకు, 6వ అంకె శుక్రునకు, 7వ అంకె కేతువునకు, 8వ అంకె, శనికి 9వ అంకె కుజునికి సంబంధించినవి.

**11. ఒక్కతేదీ బట్టియే కాక నెల సం॥తో జాతక విభజన జరుపవచ్చునా?**

ఆ విధముగా విభజన జరుపవచ్చును.ఒకని పుట్టిన తేదీ వివరాలు 1-1-1986 కాగా యీ అంకెలన్నియు వరుసగా కలిపిన 26 వచ్చినది ఆ రెంటిని కూడగా అగును. కావున 8 అంకె జాతకులనియు కేతువధిపతి అయ్యేననియు తెలిసికొనవచ్చును.

**12. ఏ అంకెవారు ఏఏ మణులు ఏఏ రంగులు ధరించాలి?**

| | | |
|---|---|---|
| 1వ అంకెవారు | మాణిక్యం | ఎరుపు రంగు |
| 2వ అంకెవారు | మంచిముత్యములు | తెలుపు రంగు |

| | | |
|---|---|---|
| 3వ అంకెవారు | పుష్యరాగం | ఊదా రంగు |
| 4వ అంకెవారు | గోమేధికం | పసుపు పచ్చ |
| 5వ అంకెవారు | గరుడపచ్చ | ఆకు పచ్చ |
| 6వ అంకెవారు | వజ్రం | తెలుపు రంగు |
| 7వ అంకెవారు | వజ్రం | తెలుపు రంగు |
| 8వ అంకెవారు | ఇంద్రనీలం | నలుపు రంగు |
| 9వ అంకెవారు | పగడం | ఎరుపు రంగు |

**13. 1వ అంకె జాతకులెవరు ?**

ఏ నెలలో పుట్టినవారైనా సరే 1, 10, 13, 28 తేదీలలో పుట్టినవారందరూ ఒకటవ అంకె జాతకులు వీరిని సూర్యగ్రహ వ్యక్తులందురు. ఆకారము–కళతో కూడిన మధ్యమ దేహస్తులు గుణగణాలు, ధైర్యం, శౌర్యం, ప్రదర్శింతురు.

తలపెట్టిన వ్యవహారాలు నెరవేరేదాకా ప్రయత్నింతురు. జీవితమును సుఖమయముగా గడుపుటకు ప్రయత్నింతురు. వీరు మేహ శరీరులు నేత్రశిరోవ్యాధులతో తరచు బాధపడు చుందురు. ఏ వృత్తిని చేపట్టినా న్యాయమార్గంలో నడిపించుటకే ప్రాధాన్యత యిచ్చెదరు బద్ధకం వీరికి పరమవిరోధి.

**14. రెండవ అంకె జాతకులెవరు ?**

ఏ నెలలో పుట్టిన వారైనా 2,11,20,29 తేదీలు గలవారు, వీరిని చంద్రగ్రహ వ్యక్తులందురు. వీరు అస్తిరచితులు తలచిన పనులు మధ్యలో ఆపివేయుచుందురు. పలు స్థలములలో నివసించుట వీరికి ఇష్టం. శ్లేష్మతత్త్వ శరీరులు. మనోవ్యాధులధికం ఆదాయమును నిల్పుకోలేరు. అప్పుడప్పుడు డబ్బుకు తొౖట్రుబాటు పడుచుందురు.

**15. మూడవ అంకె జాతకులనగా ఎవరు ?**

ఏ నెలలో అయినా సరే 3,12,21, 30 తేదీలలో పుట్టినవారిని మూడవ అంకె జాతకులందురు. వీరు గురుగ్రహ వ్యక్తులని పిలువ బడుదురు. ఆకర్షణీయమైన ఆరోగ్యవంతమైన దేహముతో అలరారుదురు. స్వతంత్ర్య జీవనం, వీరికిష్టము పలు విధములయిన విద్యలలో కళలలో ప్రావీణ్యం కలిగియుందురు. జీర్ణకోశ సంబంధమైన వ్యాధులు రాగలవు. ధన విషయములో తృప్తికరమైన పరిస్థితులలో కాలం గడుపుతారు.

**16. నాలుగవ అంకె జాతకులనగా ఎవరు ?**

ఏ నెలలో అయినా పుట్టినాసరే 4,13,22,31 తేదీలలో పుట్టిన వారిని నాలుగవ అంకె జాతకులందురు. వీరు రాహుగ్రహ వ్యక్తులు వీరు తరచు అనారోగ్యములకు గురవుతుంటారు వాత శరీరులు ప్రయాణములు వీరికిష్టం. వ్యవహారములలో లాభించ

గలదని నమ్మి ఎక్కువ సొమ్ము ఖర్చుపెడతారు. దూరదేశ ప్రయాణములు చేయు యోగములు వీరికి గలవు.

**17. అయిదవ అంకె జాతకులనగా ఎవరు ?**

ఏ నెలలో అయినా 5,14, 23, తేదీలలో పుట్టిన వారిని 5వ అంకె జాతకులని అందురు. వీరిని బుధగ్రహ వ్యక్తులని పిల్చెదరు. సామాన్య శరీరం కలిగి ఆరోగ్యమును జాగ్రత్తగా చూచుకొందురు. గణితం నందు నేర్పరులు, వర్తక వ్యాపారములు నిర్వహించి ఆస్థిని సంపాదించుకొనగలరు.

**18. ఆరవ అంకె జాతకులనగా ఎవరు ?**

ఏ నెలలో అయినా 6,15,24 తేదీలలో పుట్టినవారిని 6వ అంకె జాతకులని పిల్చెదరు, వీరిని శుక్రగ్రహ వ్యక్తులని పిల్చెదరు. వీరు చక్కని శరీర ధారుఢ్యం కలిగి యుందురు. విలాస వస్తు సంపాదనం వీరికి హాబీ. ఇతరులను ఇట్టే ఆకట్టుకొందురు. కుటుంబమందలి అందరితో అభిమానం చూపి మెలగెదరు స్వార్జిత విత్తముతో సుఖజీవితం గడుపుచుందురు.

**19. ఏడవ అంకె జాతకులనగా ఎవరు ?**

ఏ నెలలో అయినా సరే 7,16, 25 తేదీలలో జన్మించిన వారిని 7వ అంకె జాతకులందురు. వీరిని కేతుగ్రహ వ్యక్తులని కొందరు చంద్రగ్రహ వ్యక్తులని కొందరు చెప్పుచున్నారు. పొడవగు శరీరం కలిగి ఆరోగ్యంగా ఉంటారు. దేహమునకు తరచు అనారోగ్య ప్రాబల్యమబ్బును బంధువులతో మిత్రులతో యిట్టే విరోధములు తెచ్చు కొందురు. వైరులుందురు. ధనం నిలబడదు పనులు ప్రారంభించుటేకాని చివరచూడదు.

**20. ఎనిమిదవ అంకె జాతకులనగా ఎవరు ?**

ఏ నెలలో అయినా సరే 8, 15, 26 తేదీలలో పుట్టిన వారిని ఎనిమిదవ అంకె జాతకులని అందురు. వీరిని శనిగ్రహ వ్యక్తులని పిలుస్తారు. పొట్టిగా చామనచాయ శరీరమును కలిగి యుందురు. బద్ధకముతో ఏపనినీ ముట్టుకోరు. పెద్దలమాటలు కూడా లక్ష్యపెట్టరు. కుటుంబ పరిస్థితులెటులున్నను లక్ష్యపెట్టరు ఇతరులకు ఉపకారము చేయుటకు ఒప్పుకోరు స్వార్ధబుద్ధిని పైకి ప్రదర్శింతురు.

**21. 9వ అంకె జాతకులనగా ఎవరు ?**

ఏ నెలలో అయినా సరే 9, 18, 27తేదీలలో పుట్టిన వారిని 9వ అంకె జాతకులని అందురు. అందు పుట్టిన జాతకులను కుజగ్రహ వ్యక్తులని అంటారు. వీరు కురచలైన చేతులు కాళ్ళు కలిగియుందురు. గాయములతో శరీరం అస్వస్థతగా వుండును.

భూములు ఖాళీస్థలములు సంపాదించెదరు. తూచి నటుల డబ్బు ఖర్చు చేయుచుందురు. శ్రమజీవనులు, సకాలములో కాకవీలయినప్పుడల్లా భోజన ఫలహారములు స్వీకరింతురు. ఋణము లిచ్చుట పుచ్చుకొనుట ఈ రెంటియందును ప్రవీణులు .

**22. ఏ ఏ సంఖ్యలవారికి ఏఏ సంఖ్యలు మేలు కీడు ?**

| సంఖ్య | మిత్రసంఖ్యలు | శత్రు సంఖ్యలు |
|---|---|---|
| 1 | 4,6,7 | 3,2,5,8,9 |
| 2 | 3, 5, 8, | 1, 2, 4, 6, 7, 9 |
| 3 | 6, 8, 9, | 1, 2, 3, 4, 5, 7 |
| 4 | 1, 7, 9 | మిగతావి కీడు |
| 5 | 2, 3, 8 | మిగతావి కీడు |
| 6 | 3, 6, 9 | మిగతావి కీడు |
| 7 | 1, 4, 8 | మిగతావి కీడు |
| 8 | 2, 4, 5 | మిగతావి కీడు |
| 9 | 3, 6, 7 | మిగతావి కీడు |

**23. గ్రహ ప్రీతికై ఎవరేయే పూజలు జరిపించాలి ?**

1వ సంఖ్యవారు సూర్య నమస్కారములు ఆదిత్య పఠనం
2వ సంఖ్యవారు గ్రామదేవతారాధన దుర్గాస్తోత్ర పఠనము
3వ సంఖ్యవారు రామాయణ సుందరకాండ పారాయణములు
4వ సంఖ్యవారు రాహుగ్రహ ప్రీతికై పూజలు చేయవలెను.
5వ సంఖ్యవారు బుధపూజలు మృత్యుంజయ జపం
6వ సంఖ్యవారు లక్ష్మీస్తోత్ర పారాయణం
7వ సంఖ్యవారు దుర్గా గణేశ పూజలు
8వ సంఖ్యవారు శనిజపం, రుద్రాభిషేకం
9వ సంఖ్యవారు నవగ్రహ పూజలు జరిపించవలెను.

**24. సంఖ్యాశాస్త్ర మర్మములు తెలిసికొనుటవల్ల లాభమేమి ?**

లాటరీలు వగైరాలలో జయాపజయములు తెలిసికొన వచ్చును. ఏ అంకె జాతకులతో దాంపత్యం శుభమగును. అనువిషయము స్పష్టమగును. అదృష్ట సంఖ్య, అదృష్ట రత్నములు ముందుగా తెలిసికొని ఆచరించి సుఖపడుటకు వీలగును. మన దేశములో కంటె తక్కిన దేశములలోని వారికి ఈ శాస్త్రము పైన ఎక్కువ మక్కువ.

**25. 1వతేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఇందు జన్మించినవారు మధ్యమ దేహముతో ఆకర్షిణీయమగు ముఖము కలిగి యుందురు. వివిధ శాస్త్రములను పరిశోధనలు జరిపెదరు. చక్కగా విద్యనభ్యసించి మంచి ఉద్యోగము నిర్వహించెదరు. ఆరోగ్యవంతులు.

**26. 2వ తేదీ జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ఇందు పుట్టినవారు తెలుపు వర్ణము కలిగిన దేహముతో చూడముచ్చటగా కనిపించెదరు. వ్యవహారములు పరిష్కరింతురు. ప్రశాంతమైన మనస్సు కలిగి పరోపకార బుద్ధితో సంఘజీవనం చేయుదరు.

**27. 3వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

వీరు చామనఛాయ దేహము కలిగియుందురు. ఆచారములను పాటింతురు. విద్య చక్కగా అలవడును. తనకు తెలిసిన విద్యలు ఇతరులకు సులభముగా తెలియునట్లు బోధపర్చగలరు.

**28. 4వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

జన్మించినవారు బలిష్టమైన శరీరము కలిగి ఉందురు. కఠినపు మాటలాడెదరు. తరచుగా ప్రయాణములు చేయుదరు. సగము విద్యతో ప్రజ్ఞ కలిగినట్లు నటింతురు, అనారోగ్యవంతులు.

**29. 5వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

తెలుపు, ఎరుపు రంగు కలిగి ఉందరు. ఆలోచనలు ఎక్కువ. ఇతరులను వశపరచు కొందురు. ఉద్యోగంలో కన్నను వృత్తి వ్యాపారాల్లో బాగా రాణింతురు.

**30. 6వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

స్ఫుర ద్రూపముతో అలరారుదురు. ఎవరేమి చెప్పినను విని నమ్ముదురు. ఎక్కువ మందితో పరిచయం కలిగి పనిపాట్లు నిర్వహించుకొని లాభములు పొందుదురు.

**31. 7వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

వీరు చిత్రవర్ణ శరీరము కలిగియుందురు. మోసబుద్ధిని చూపింతురు. ధనరాబడి తక్కువ, ఖర్చులు అధికముగా గావించుచుందురు. అనాచారపరులు, అప్పుడప్పుడు మాట తప్పుట జరుగును.

**32. 8వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

నలుపుతో కూడిన శరీరము కలిగియుందురు. నాస్తిక వాదమిష్టము, ఆలస్యముగా విద్యను గ్రహింతురు. ప్రతి పనిని మందముగా నెరవేర్తురు. బద్ధకము విడిచిపెట్టక నిద్రయనిన ప్రీతి చూపించెదరు.

**33. 9వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

సామాన్య శరీరముతో తరచు అనారోగ్యములకు గురియై జీవింతురు. అల్ప బలము కలవారైనను ప్రతివారితో వాదనలకు దిగుచుందురు. ఋణములు చేయుటకు ఉవ్విళ్ళూరు చుందురు.

**34. 10వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

తేజస్సుతో కూడిన ముఖముతో, చురుకుదనముతో కూడిన కార్యక్రమములతో ఎల్లప్పుడు హడావుడిగా ఉందురు. శాస్త్రజ్ఞానము గలవారై సాటివారిలో ప్రఖ్యాతి వహించి వెలయుచుందురు.

**35. 11వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

సౌందర్యోపాసకులు, ఆకట్టుకొనే రూపముతో చల్లని కబురులు చెప్పుదురు. అమాయకస్వభావముతో అందరినీ నమ్ముదురు. ఆరోగ్యవంతులు.

**36. 12వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

మంచి ఆరోగ్యవంతులు, పరుల మేలుకోరి పనులను సాధించి పెట్టుదురు. పెద్దఉద్యోగములు నిర్వహించి ధనమును విరివిగా కూడబెట్టుదురు.

**37. 13వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

స్వవిషయాలలో ఆసక్తి మెండు. ఆరోగ్యమును లక్ష్యపెట్టక కృషిచేయుచుండును. ప్రయాణాలు ఎక్కువగా చేయుచుందురు. ప్రమాదములకు గురియగుచుందురు.

**38. 14వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

వ్యవహార జ్ఞానమధికము, అందరితో మైత్రిగా ఉండి పనులు ముగించుకొందురు. తక్కువ పెట్టుబడితో ఎక్కువగా ధనమును గడించు నేర్పుగలవారు.

**39. 15వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

వీరికి ఏకాంత, ప్రశాంతజీవితమనిన మిక్కిలి ఇష్టము. స్త్రీలయందభిలాష ఎక్కువ. శుభారోగ్యమును కలిగియుందురు. జన్మతః ఐశ్వర్యవంతులు, విలాస జీవితమును గడుపుచుందురు.

**40. 16వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

అనుకూల దాంపత్యము అభివృద్ధికరమయిన ఉద్యోగము కలవారై సుఖజీవనము చేయుచుందురు.

**41. 17వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ప్రగల్భములు జాస్తి, చేసేపనులు తక్కువ. అనాచారములు, నిద్రయందు మక్కువ. అన్నిటిని రేపటికని వాయిదా వేయుదురు. అస్థిరచిత్తముతో మెలగుదురు. చేసిన ప్రతిజ్ఞలు మరచిపోవుదురు.

**42. 18వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

సన్నగా పొడవుగా ఉంటారు. ఆకలి ఎక్కువ. ఏదీ దాచుకొనరు. ఇతరులకు కొంత పంచిపెట్టుదురు. లాటరీలు నిర్వహింతురు. సోదరమైత్రి కలిగియుందురు.

**43. 19వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

స్వయంశక్తితో పైకి వచ్చెదరు. గురూపదేశములు విందురు. ఆరోగ్యవంతులు, ఆనందమయ జీవితమనిన యిష్టము, ఉన్నత స్థానము సంపాదింతురు.

**44. 20వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

గొప్పలు గిట్టవు, ఎవరు చెప్పినా విందురు. యోచనకూడ చేయుదురు. కష్టముల కోర్వజాలరు. పశ్చాత్తాప గుణము కలిగియుందురు.

**45. 21వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఒకరిచేత చెప్పించుకొనరు. సలహాలు ఇతరుల కిచ్చుటలో నేర్పరులు. భవిష్యత్తుపట్ల నమ్మకము గలవారు పెద్దలయందు, వారి మాటయందు విశ్వాసముంచి సంచరించుచుండును.

**46. 22వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ముందాలోచన తక్కువ. ఎవరేమి చెప్పినా వినరు. జూదముల వంటివి యిష్టము. ప్రయాణాలలో పరాకు, గాయముల వంటివి సంభవము. పట్టుదల జాస్తి. స్థానమును తృటిలో మార్చుచుందురు.

**47. 23వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

మెల్లగా నచ్చచెప్పి చల్లగా పనులను పూర్తిచేసి కొందురు. మాటలు ప్రీతి చేతులు వట్టివే. ఎంతో అవసరము వచ్చినగాని ఎవరినీ లక్ష్యపెట్టరు. ఆలోచించి ధనమును ఖర్చు చేయుదురు.

**48. 24వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఆశపరులు కారు శ్రమకు తగిన ప్రతిఫలం మాత్రం తీసికొందురు. ఆరోగ్యముపట్ల శ్రద్ధ చూపుదురు. మాటలకు చేతలకు పొంతన సరిపోవును. ఎక్కువమంది స్నేహితులు, బంధువులు కలిగియుందురు.

**49. 25వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

సాటివారిలో పేరుప్రఖ్యాతులు గలవారు. ఇతరుల మాటను కొట్టివేయరు. స్త్రీల ఆస్తిపాస్తులు అంకించు కొందురు. వేగముగా శాస్త్రాధ్యయనము చేయగలవారు.

**50. 26వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

బద్ధకముతో పనులు ప్రారంభింతురు. అట్లే విడిచి పెట్టుదురు. చేతిలో డబ్బు నిలువదు. పరులసొత్తును కూడ స్వంతమువలె వాడుకొందురు. ఆరోగ్యము దృఢంగా ఉంటుంది.

**51. 27వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

యోచనాశక్తి తక్కువ. తొందరపాటుతో అన్నిపులు ప్రారంభింతురు. గురువులను నమ్మరు. రేపు అనిన వీరికి గిట్టదు. భోజనప్రియులు, ధైర్యమునకు సంబంధించిన ఉద్యోగములో వేరు రాణింతురు.

**52. 28వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఇతరుల లోపములను ఎత్తిచూపుదురు. ధనమునువిరివిగా ఖర్చుచేయుదరు. తలవని తలంపుగా మారి పోవుచుందురు. ఏదో ఒక కళలోనో శాస్త్రములోనో ప్రవీణులై ఉందురు.

**53. 29వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

నిండుకుండ తొణకదు అనునట్లు తమకు సర్వము తెలిసినను ఏమీ ఎరుగనట్లు కనబడుదురు. సుఖదుఃఖములను బయటకు వెలువరించరు. స్త్రీలవల్ల అపవాదులు అనుభవింతురు.

**54. 30వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

ఆజన్మ సుఖవంతులు, ధనవిషయంలో జాగ్రత్తగా ఉందురు. పరోపకారబుద్ధితో కాలక్షేపము చేయుచుందురు. హితబోధ చేయుటలో ప్రజ్ఞా ప్రాభవములు విశేషముగా చూపుచుందురు.

**55. 31వ తేదీ జన్మించినవారి లక్షణాలు ఏవి?**

తమ మనస్సునకు నచ్చినట్లు సంచరింతురు. నాస్తికవాదమెక్కువ. పూర్వాచారము లను నిందచేయుటలో అగ్రగణ్యులు ఆదాయమును మించిన వ్యయముచేయు చుందురు. దేశదిమ్మరులై కాలము గడుపుదురు.

**56. జనవరి నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ఇందు పుట్టిన బలమైన శరీరముతో మధ్యమదేహము కలిగియుందురు. పట్టుదల, పగజాస్తి, కష్టించి ఎన్నో శాస్త్రవిషయాలు సంగ్రహణ మొనర్తురు.

**57. ఫిబ్రవరి నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

వాతత్త్వ శరీరులు, భయస్థులు, క్రూరకార్యములు చేసి తప్పులు కప్పిపుచ్చుకొందురు. దైవభక్తి విడువరు. ఆరోగ్యమును లక్ష్యపెట్టరు.

**58. మార్చి నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

సన్ననిదేహము, తరచూ అనారోగ్యములకు గురియగుచుండును. శ్రమకోర్చి విద్యాభ్యాసము గావింతురు. పెద్దలయందు వినయ విధేయతలు కలిగి ఉందురు.

**59. ఏప్రియల్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

బాల్యములో అనారోగ్యముతో పెరిగినా యౌవనాత్ ఆరోగ్యవంతులగుదురు. నూతన కృషి గావించి పరిశోధనలు విజయవంతం చేయుదురు. డబ్బుకి యిబ్బంది పడరు.

**60. మే నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ఇందు జన్మించిన దేహారోగ్యము కలిగి ఉందురు. స్థిరచిత్తము కలిగి ఉందురు. ప్రలోభాలకు లొంగరు. దిగజారిన వంశప్రతిష్టలు పైకెత్తుదురు.

**61. జూన్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

వీరు సామాన్య దేహముతో చురుకుదనము కలిగి ఉందురు. తొందరగా నడతురు. బాల్యములో అవివేకంగా నున్నను, యౌవనం లగాయితూ విజ్ఞాన వంతులుగాను రాణింతురు.

**62. జూలై నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

పొడవరులు, గర్విష్టులు,కాని నిజమాలోచించి అటు ప్రక్కకు తిరుగుదురు. ప్రేమ వ్యవహారాల్లో చిక్కుకొని అధికకాలం నిరీక్షింతురు.

**63. ఆగష్టు నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

పరిపుష్టమైన అవయవములతో నిండుకుండవలె తొణకక బెణకక ఉందురు. దీర్ఘాలోచన చేయకయే పనికి పూనుకొనరు. స్వతంత్రించి జీవించెదరు.

**64. సెప్టెంబర్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

శరీరశుభ్రత తక్కువ, ఆలస్యముగా పనులు చేయుచుందురు. ఉపకారబుద్ధితో సంఘసేవతో అంకితమై ఉందురు. ఖర్చుచేయుటలో లోభత్వంచూపుదురు.

**65. అక్టోబర్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ఆరోగ్యవంతులై నిర్మలమయిన మనస్సు కలిగి జీవింతురు. విజయ కాంక్షతో కార్యములను ప్రారంభింతురు. స్వార్జిత ధనసంపాదనము వీరి లక్ష్యము.

**66. నవంబర్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

సన్నగా పొడవుగా దృఢమైన శరీరముతో ఉందురు. దైవభక్తియున్నను ఆచార వ్యవహారములన్న పూర్వీకులవి తనకు గిట్టవు. విశేషమయిన ఖర్చుదార్లు.

**67. డిశంబర్ నెలలో జన్మించిన వారి లక్షణాలు ఏవి?**

ఇందు పుట్టినవారు తండ్రి పోలికలున్నవారయి అట్టి బుద్ధులనే కలిగియుందురు. అన్నింటిలో వెనుకబడి యుంటారు. క్రొత్త విధానాలవలంభించి ధన సంపాదన చేయుదురు.

# జ్యోతిష్ ప్రశ్నోత్తరమాల

## నాలుగవ అధ్యాయము-గృహవాస్తు

( ప్రశ్నోత్తర రూపమున వ్రాయబడిన జ్యోతిష గ్రంథము )

**1. గృహం యొక్క ఉపయోగమేమి ?**

మానవులయొక్క సుఖ జీవనానికి స్వర్గసీమ వంటిది. గృహం మందిరం లేనిదే మనుజులు మనజాలుట కష్టమైనది. ఇల్లు ఒక్క ఇంటి యజమానికేకాక అతని కుటుంబ మునకు అతని బంధువర్గమునకు కూడా సుఖ భోగములనుభవించుటకు ఆనకట్టు అగుచున్నది. పక్షులకు గూళ్ళు, వన్య, మృగములకు పొదలు, మునులకు పర్ణశాలలు పూర్వకాలం నుండి ఆశ్రయమై నటుల నరులకు ఇండ్లు వాసయోగ్యమగు చున్నవి. చలివర్షం ఎండల నుండి గృహం మనలను రక్షించును.

**2. వాస్తు శాస్త్రమనగా నేమి ?**

గృహం ఎట్టి స్థలములో కట్టుకొనవలెనో ఎటుల నిర్మించుకొనవలెనో దాని నిమిత్తం ఏఏ పూజలు జరిగించవలెనో ఈ మొదలగు విషయాలు వాస్తు శాస్త్రములో

వుంటాయి. వసుధాతువునకు అర్థం, నివాసం, భూమి వసువనబడును భూమియొక్క గుణదోషం లెరిగి తగిన స్థలములో ఇల్లు కట్టుకోవలెను.

**3. స్థలమును ఎట్లు సిద్ధపరచవలెను ?**

గృహము కట్టబోవు స్థలములో ముందుగా కొంతకాలం పశువులను కట్టుచుండవలెను. ఆ స్థలములో ఎచ్చటైననూ భూమిలో కప్పబడివుంటే తీసిపారవేయ వలెను. తోటలు వేయుచున్నది. వ్యవసాయం చేయుచున్నది, అగు భూమిని గృహమునకు ఎన్నుకోవలెను.

**4. ఎట్టి భూమి మంచిది ?**

అన్నిటికి ఆధారభూతమైన ఈ భూమి లేకుంటే ఏదీ లేదు. ఏది నిర్మిద్దామన్నా ఈ భూమి ఆధారమై నిలవాలికదా ముండ్లతుప్పలు గోతులు బీటలువారిన భూమి అయోగ్యమైనది. ఫలపుష్ప శోభితమయినది, మంచిది అట్టి భూమిని చదును చేయవలెను. ముఖ్యముగా బండలు బొరియకవలది పనికిరాదు.

**5. భూశోధన గురించి ఒక పద్ధతిని వివరింపుము ?**

గృహము నిర్మింపబోవు స్థలము వాసయోగ్యమో కాదో తెలిసికొనుటకై ఆ జాగాలో సూర్యాస్తమయంలో మూరలోతు గొయ్యి త్రవ్వి దానినిండా నీరుపోసి ఉదయముననే లేచి చూచిన కొంచెమైన నీరున్న మంచిది. బురదలావున్న మధ్యమము, పొడిగా వుండిన అధమము, ఈ మూడవ రకపు భూమిలో ఇండ్లు కట్టరాదు.

**6. భూములలోని రకములను తెల్పుము ?**

1. బ్రాహ్మణభూమి–ఇది తెలుపురంగుగలది. నెయ్యి వాసనతో తియ్యని దర్భలతోనిండి ఉత్తర దిక్కునకు నీరు పారునది. 2. క్షత్రియభూమి – ఎరుపురంగు కలిగి రక్తవాసనతో కషాయరుచి కలిగి తుంగతో నిండి తూర్పుకి నీరు ప్రవహించునది. 3. వైశ్యభూమి–పసుపు వర్ణం కలిగి మధువాసనతో ఆమ్లము రుచితో సమానముగా ఉన్న భూమి దక్షిణవాలు గలది. 4. శూద్రభూమి నల్లనిరంగు కలిగి మధ్యమువంటి వాసనతో కటుకరుచితో వికటముగా ఉండును. పశ్చిమ దిక్కునకు నీరు.

**7. నీటివాలు ఎటులుండవలెను ?**

నీటివాలు తూర్పు, ఉత్తరము, ఈశాన్య దిక్కులకు పోయినచో శుభం, తక్కిన దిక్కులకు పోయినచో అరిష్టదాయకము. కావున యీ స్థలములు కొలది ఎత్తుగా ఉంచుకొనుట శుభదాయకము.

**8. ఇల్లు కట్టకూడని సమయాలేవి?**

యజమాని యొక్క భార్య గర్భవతియై యుండగా 3 నెలలవరకు శుభకరం. తర్వాత 3 నెలలు మధ్యమము 6 నెలలు దాటిన పిదప గృహారంభం చేసిన గర్భహానియు

గృహకలహములును సంభవించును. వివాహ శుభకార్యం జరిగించిన తర్వాత సంవత్సర పర్యంతం నిర్మాణం కూడదు.

**9. సుప్తభూమి అనగా ఏమి ?**

సూర్యుడు నక్షత్రమునకు 1, 5, 7, 8, 9, 12 నక్షత్రములు భూమికి నిద్ర కలుగజేయును. కావున ఆ నక్షత్రములందు గృహ, వాటి, తటాక, కూపాదులె నిర్మాణం చేయరాదు.

**10. ధ్వని పరీక్ష యెట్లు చేయవలెను ?**

ప్రతిధ్వనులు రాకూడదు. కీచురాయి ధ్వని భయంకరధ్వని పనికిరాదు. వేణువు, వీణ, మృదంగం, ఏనుగు, సముద్రం ఇవి చేయు శబ్దం వంటి ధ్వనులు మంచివి.

**11. గృహభూమి ప్రమాణం తెల్పుము ?**

తన కుడిపాదమునుండి కుడిచెవి వరకు ఒక కఱ్ఱను కొలసాధనముగా చేసుకొని గృహం కట్టబోవు స్థలం యొక్క పొడవు, వెడల్పు రెండింటిని కొలిచి వచ్చిన మొత్తమును 3చే భాగించగా 1,4,6 శేషం వచ్చిన శుభం 2,3,5,7,8 వచ్చిన అశుభము.

**12. గృహస్థలంయొక్క ఎత్తుపల్లం లెట్లుండవలెను ?**

ఉత్తరం, తూర్పు దిక్కులు పల్లముగను, దక్షిణం, పశ్చిమము అంతకంటె కొలది ఎత్తుగాను ఉండవలెను. ఈశాన్యం పెరిగి యుండుట ప్రశస్తం తూర్పు, పడమరలకు ఎక్కువ స్థలం ఉత్తర, దక్షిణములకు తక్కువ స్థలం, ఉండుట శుభం.

**13. గ్రామార్వణ మనగా ఏమి ?**

గ్రామముయొక్క పేరులోని అక్షరములను లెక్కించి గృహకర్త నామాక్షరములను చేర్చి 2చేత భాగించాలి. అట్లు భాగించగా వచ్చు శేషం 1జీవభూమి 2. సమభూమి 3. మాతృభూమి అని ఎరగవలెను.

**14. మూలలకు ఇండ్లు ఏల కట్టరాదు ?**

ఇంద్రుడు యముడు, వరుణుడు, కుబేరుడు నాలుగు దిక్కులకు అధిపతులు, వీరు శుభమిత్తురు. కావున యీ దిక్కులందు ఇండ్లు కట్టవచ్చును. అగ్ని, నైఋతి, వాయువు, ఈశాన్యుడు మూలలకు అధిపతులు, వీరు అశుభఫలమిత్తురు. కావున మూలలకు ఇండ్లు కట్టకూడదు.

**15. పునాదు లెట్లుండవలెను ?**

18 అంగుళములు విడివితో 24 అంగుళముల లోతుకి తక్కువ కాకుండా పునాదులు తీయవలెను.

**16. క్షేత్రీకృత పదమనగా నేమి ?**

స్థలంయొక్క పొడవును వెడల్పుచే గుణించగా క్షేత్రీకృతపదము వచ్చును. ఆ పదమును 8చేత గుణించి 12 చేత భాగించగా శేషము ధనము ధనసంఖ్య, హెచ్చు రావలెను. 3చేత గుణించి 8చేత భాగించగా శేషం ఋణము ఋణసంఖ్య తక్కువ ఉండవలెను. 6చేత గుణించి 7 చేత భాగించిన శేషం వారము శుభవారము రావలెను. 9చేత గుణించి 30చేత భాగించిన శేషము తిథి నందాది శుభతిథిరావలెను. 8చేత గుణించి 27చేత భాగించగా శేషము నక్షత్రము యోగ్యతార ప్రాప్తించవలెను.

**17. ఆయములు అనగా ఏమి ?**

గృహయజమాని నక్షత్రము వరకు తారాబలం చూడవలెను. 9చేత గుణించి 8చేత భాగించగా మిగిలిన శేషం ఆయము ఇది 1 ధ్వజాయం-ధనలాభం కలిగించును. 2. ధూమాయం-దుఃఖం, 3. సింహాయము-జయం 4. వాన్వాయం భయం 5. వృషాయం, లాభం 6. ఖరాయము-రాజభయము 7. గజాయము, సౌఖ్యము 8. కాకాయము, దేహపీడ.

**18. శల్యవాస్తును గురించి వివరింపుము ?**

శల్యములనగా ఎముకలు ఇవి కట్టబోవు ఇంటి స్థలములో కొంత లోతున కప్పబడి యుండవచ్చును. ఇట్టివి పునాదులు తవ్వుచున్నప్పుడు కనపడినచో తీసివేసి ఊరిబయట జరిగించిన ఆ దోషము పోవును. శల్యములు కాక త్రవ్విన పునాదులలో బంగారము, వెండి, రాగి కన్పించిన శుభము. పెంకులు, రాగి కన్పించిన శుభం, పెంకులు బొగ్గులు కనబడుట అశుభం.

**19. వృషభ చక్రశుద్ధి గూర్చి తెల్పుము ?**

అభిజిత్తుతో కలిసి 27 నక్షత్రములలో రవియున్న నక్షత్రమునకు గృహప్రవేశ నక్షత్రము 6,9,11,12,15,16,17,18,19,20,21,22,23,24,25,26,27 వరకును గల సంఖ్య అయినచో ఆ నక్షత్రము వృషభ చక్రశుద్ధిగా గలదిగా ఎరుగవలెను.

**20. కలశ చక్రశుద్ధి గూర్చి తెలుపుము?**

27 నక్షత్రాలలోను రవియున్న నక్షత్రమునకు తత్కాల నక్షత్రం నుండి 8 నుండి 12 వరకును మరల 12 నుండి 16 వరకును గల సంఖ్య గలది అయినచో ఆ నక్షత్రం కలశచక్రశుద్ధి కలదిగా ఎరుగవలెను. గృహప్రవేశ విషయములలో యీ శుద్ధులు రెండును ముఖ్యమైనవి.

**21. కట్టుపని ప్రారంభమెట్లు జరుపవలెను ?**

ఇట్లు కట్టునపుడు దక్షిణ పశ్చిమ దిశలకు యీ హద్దులు దాటి మరి వెళ్ళకూడదు.

**22. గృహ ఆయుర్దాయమెట్లు తెలియును ?**

లగ్నమందు గురుశుక్రులుండగా కట్టినయిల్లు నూరు సంవత్సరములును, బుధుడు లగ్నమందుండగా 50 సం॥లు పైగాయున్నూ మంచి బలవంతులగు 9 గ్రహములు లగ్నమందుండగా కట్టిన యిల్లు పరిపూర్ణ బలయుక్తమై వర్ధిల్లగలదు.

**23. వాస్తు పురుష స్థితిని తెల్పుము ?**

వాస్తు పురుషుడు భాద్రపద ఆశ్వీయుజ కార్తీకమాసము లందు తూర్పు శిరస్సు గలిగి ఎడమ ప్రక్కను శయనించును. కావున ఈ నెలలందు పశ్చిమ దక్షిణ సింహద్వారములు గల గృహములకు శంకుస్థాపన చేయవచ్చును. మార్గశిర పుష్య మాఘ మాసములందు దక్షిణ శిరస్సుగా నిద్రించును. ఈ మాసములందు పడమర ఉత్తర సింహద్వారములు గల యిండ్లు కట్టవచ్చును. జ్యేష్ట ఆషాడ శ్రావణ మాసములందు పడమర ఉత్తర సింహద్వారములు గల యిండ్లు కట్టవచ్చును. జ్యేష్ట ఆషాడ శ్రావణ మాసములందు ఉత్తర శిరస్సుగా నిద్రపోవచ్చును. ఆ సమయాలలో దక్షిణ తూర్పు సింహ ద్వారములు గల యిండ్లు కట్టవచ్చును.

**24. వాస్తు పురుష పూజా సమయములేవి ?**

గృహారంభం జరిగించునప్పుడు గృహప్రవేశ కాలమున జీర్ణ గృహోద్దరణం జరిగిన పిదప తిరిగి అందులోని కెళ్లినప్పుడు స్థంభ మెత్తునప్పుడు యింటిపై పిడుగు పడినప్పుడు వెన్నుదూలము విరిగినప్పుడు గుడ్లగూబలు, గ్రద్దలు, కాకులు వాసమువేసి కొన్నప్పుడు నూయి త్రవ్వినప్పుడు వాస్తు బ్రహ్మను పూజించి సంతృప్తి పొందిన వాస్తు శాంతి తప్పక జరుగును.

**25. వాస్తు పూజ ప్రాముఖ్యమేమి ?**

వాస్తుపురుషుడు అధికబలసంపన్నుడు సకలదేవతలు అతనియందు ఆశ్రయింతురు. బ్రహ్మదేవుడతనికొక వరమిచ్చెను. అతడిని పూజింపక యిల్లు కట్టిన వారికి ఆపదలు కలుగగలవని కావున యీ పూజకు అధిక ప్రాముఖ్యమున్నది.

**26. శంకు ప్రమాణ మెట్లుండవలెను ?**

బ్రాహ్మణులకు 24 అంగుళముల శంకువునుస్థాపన స్థాపించవలెను.

క్షత్రియులకు 20 అంగుళములు, వైశ్యులకు 16 అంగుళములు, శూద్రులకు 13 అంగుళముల ప్రమాణము గల శంకువును స్థాపింపవలెను. కాని ప్రస్తుతము అన్ని జాతులవారు 12 అంగుళముల పరిమితిగల శంకువునే స్థాపించుచున్నారు.

**27. శంకువు ఆకార మెట్లుండవలెను ?**

శంకువు చంద్రుడు, టేకు, గుగ్గిలము, ఈ కర్రలతో దేనితో అయినను చెక్కించవలెను. దీనికి 3 భాగములుగా విభజించవలెను. తొలిభాగము నాలుగు పలకలగాను, రెండవ భాగము ఎనిమిది పలకలు కలదిగాను, మూడవభాగము అనగా పైభాగం వర్తులాకారముగాను ఉండవలెను. దీనిని పూజించి పునాదులలో పెట్టెదరు.

**28. ప్రహరీ గోడలు ఎప్పుడు కట్టవలెను ?**

ఇంటి స్థలమునకు ముందుగా ప్రహరీగోడలు నిర్మించుకొని ఆపై ప్రధానమైనవి తక్కినవి అన్ని కట్టుకొనవలెను. ప్రహరీ నిర్మించిన తర్వాతనే ఇంటికి తగిన ప్లానులు నిర్ణయించుకోవలెను.

**29. సూర్యరశ్మి గృహముపై యెటుల పడవలెను ?**

గృహమధ్యమును సూర్యరశ్మి పడుచుండుట శుభకరము, ఉదయం 10 గంటల నుండి మధ్యాహ్నం 2 గంటల వరకు సాధారణముగా ప్రతి ఇంటిలోను సూర్యుని వెలుగు ధారాళముగా పడుచుండును.

**30. ఇంటిపై ఏ నీడలు పడకూడదు ?**

ముందు ఇంటినీడ వెనుక ఇంటిమీద పడరాదు అనగా వాకిలి పెద్దది ఉండవలెను. ఇతరుల ఇంటినీడ, చెట్లనీడ దైవమందిరముల నీడ యివి ఇంటిపై పడరాదు.

**31. సింహద్వార మెచ్చట ఉండవలెను ?**

హాలుకి మధ్యభాగమున సింహద్వారమును నిలపవలెను. దానికి రెండు పక్కలా 2 కిటికీలు వుండవలెను. ఇది గృహ గర్భంనకు నాలుగవ వంతు వెడల్పు గలదిగానూ వెడల్పుకి రెట్టింపు పొడవు గలదిగానూ వుండవలెను.

**32. ఏ ఇంటికొరకు ఏ కలప ప్రశస్తము ?**

గుగ్గిలము, టేకు, పొన్న, దేవదారు, వేగిశ, మద్ది, నేరేడు మంచి గంధము, యిరుగుడు, గుమ్ము, కరక మొదలగునవి ముఖ్యమైనవి.

**33. ఏవి పనికిరావు ?**

జమ్మి, రావి, మేడి, గానుగ, వేప, మర్రి మరియు తగులబడ్డవి, విరిగినవి,

పిడుగు పడ్డవి ఇతరుల యిండ్లకు యిదివరకు వాడినవి పనికిరావు. కొత్తయిండ్లకు అంతా కొత్త సరుకునే వాడవలెను.

**34. ఇటుకల కొలత లెటులుండవలెను ?**

పొడవులో సగం వెడల్పు వెడల్పులో సగం యెత్తు ఉండవలెను. అనగా 9+41/2+21/4 సైజులో తయారుచేసి చాలామంది అమ్ముచున్నారు.

**35. దూలముల కొలతలు ఎట్లుండవలెను ?**

దూలములు విడిచి 8,9,10 మూరలుండుట శుభం. 10 మూరలుండరాదు. యింటికి వేయు దూలములు సమసంఖ్యలో ఉండవలెను. 12 మూరలకంటె హెచ్చు పొడవుండరాదు. దూలముల మొదళ్ళు దక్షిణ పశ్చిమ దిశలకు మాత్రమే పెట్టవలెను. రెండు మొదళ్ళు ఒకే ప్రక్కకు పెట్టరాదు. విడుపు దూలములు వేయుట పనికిరాదు.

**36. గోడలు కట్టు విధమెట్లుండవలెను ?**

యింటి వెడల్పు ఎంత ఉండునో గోడల యెత్తంత ఉండవలెను. గృహగర్భము 4 హస్తముల పొడవుంటుట శుభం ఒకే గోడమీద రెండు యిండ్లు కట్టరాదు.

**37. గుజ్జులు గురించి నీకేమి తెలియును ?**

గుజ్జులనే గురుజులందురు. ఇవి బేసి సంఖ్యలో వేయవలెను. సరిసంఖ్య కూడదు.

**38. వెన్ను నిర్మాణ మెట్లుండవలెను ?**

యింటికి గల వెన్ను తూర్పుదిక్కున క్రిందికి వంగి యండుట మేలు, ప్రక్కయింటివారి వెన్నుతో ఈ వెన్ను కలియు నటులుండవలెను. లేని యెడల వెన్ను దోషమేర్పడును.

**39. ఉల్లోపు కొలతలు అనగా నేమి ?**

ద్వారములు కిటికీలు మొదలయినవాటి ఉల్లోపు వెడల్పులను అంగుళములోనికి కొలవవలెను. వచ్చిన దానిని 9చే భాగించగా 1,3,7,8,9 శేషము వచ్చిన చెడ్డది. 2,4,5,6 వచ్చిన శుభము.

**40. యింటి గర్భము అనగా నేమి ?**

యింటిగర్భం అనగా వెన్నుపట్టికి రెండు ప్రక్కలా ఉండు స్థలం వెన్నుపట్టినుండి గడపలు ప్రారంభమగువరకు గల ప్రధాన మందిరం యొక్క వెడల్పు యింటి గర్భం.

**41. ద్వారం లెటుల పెట్టవలెను ?**

ద్వారం దూలముల క్రింద పెట్టరాదు. ఒకేజాతి కలపతో ద్వారబంధనం చేయించవలెను. ద్వారములపైన ద్వారములు పెట్టరాదు. ఉత్తర, దక్షిణ దిక్కులలో ద్వారం లుండవలెను. 64 అంగుళముల పొడవు 34 అంగుళముల వెడల్పుగల కొలతలతో ఉండవలెను.

**42. స్థంభములు గూర్చి నీకేమి తెలియును ?**

రాతితోచెక్కిన స్థంభములు గాని, ఇటుక, సిమెంటుతో కట్టిన స్థంభములుగాని పనికివచ్చును. బేసి సంఖ్యలో ఉండరాదు.

**43. కిటికీలు యెట్లునిర్మించవలెను ?**

సింహద్వారమున కిరుప్రక్కల కిటికీలు ఉండవలెను. కిటికీలు జవాబుదారీగా ఇంకొక కిటికి ఉండవలెను. అరమరలు ఉంచుట అంత మంచిదికాదు.

**44. తలుపులు గురించి తెల్పుము ?**

ఒకేచెక్కతో చేసిన తలుపులు ప్రశస్తం లేదా 3 చెక్కలు కలిపి చేయవలెను.

**45. గృహారంభమెట్లు జరిగించవలెను ?**

గృహారంభమునే శంకుస్థాపన యందురు. దీనికి సంబంధించిన ముహూర్త విశేషములీ పుస్తకములోనే ముహూర్త భాగములో గలవు. గృహయజమాని యొక్క తారాబల, చంద్రబలములు బాగుండవలెను. ముహూర్తం యోగ్యమై యుండవలెను. పౌరోహిత్యుడిచ్చు చీటి ప్రకారం సామానులు సంపాదించి వాస్తు పూజ మొదలు పెట్టవలెను.

**46. యింటిలోని గదులెటుల యేర్పాటు చేయవలెను ?**

తూర్పున స్నానాలగది, ఈశాన్యమున పూజామందిరం ఉత్తరమున ధనగృహం, వాయవ్యమున ధాన్య గృహం పడమర భోజనపుగది, నైఋతిని సామానులగది, దక్షిణమున పడకగది ఆగ్నేయమున వంటగది ఉండునటుల కట్టవలెను. ఈశాన్య దిక్కున నూయి తీయవలెను.

**47. గృహప్రవేశ మెటుల చేయవలెను ?**

ఒక నూతన కలశములో పంచ పల్లవములు, గరిక, నీరు, తేనెచేర్చి, పసుపు, కుంకుమ, అక్షతలు దానికి అద్ది క్రొత్త (తెల్లని) వస్త్రమును దానికి చుట్టి ఆ పూర్ణ పాత్రను ఫలపుష్పములతో నింపి గృహయజమాని తన హస్తములతో ధరించి విప్రులు వేదోక్తమంత్రములు పఠనం గావించగా బంధుమిత్ర దాసదాసీ జనములు తోడురాగా,

